నమః పరమాత్మనే.

"అ హిం సా ప ర మో ధ ర్మః"

ఆంధ్రప్రబోధినీగ్రంథనిలయము ఇతరప్రచురములు ౧

# జీవకారుణ్యము

అను

(మద్యమాంసనిషేధ మహాఫలనిరూపణము)





గ్రంథకర్త:

కారుపల్లి శివరామదాసు

నమః పరమాత్మనే.

"అహింసాపరమోధర్మః"

ప్రబోధినీగ్రంథనిలయము ఇతరప్రచురములు ౧

# జీవకారుణ్యము

అను

(మద్యమాంసనిషేధ మహాఫలనిరూపణము)





గ్రంథకర్త:

కారుపల్లి శివరామదాసు




శా॥ శ్రీకల్యాణగుణాఢ్యుఁడై త్రిభువన క్షేమంకరోల్లాసుఁడై।
లోకేశుల్పరిచర్యసేయవిబుధాళుల్ భక్తితో వేఁడ శాం।
తైకారూఢిననేకరూపముల నిత్యానందస పూర్ణుఁడై।
సాకల్యంబుగఁబ్రోచు దేవుఁడిమత్క సౌహార్ద్రశాంతం
[బులన్॥

భద్రమగుఁ గాక; శ్రీపరమేశ్వరానుగ్రహముచే లోకమునం దెల్లెడల జీవదయాపరత్వము నెలకొనుఁగాక. నిర్దయావంతుల హృదయక్షేత్రముల యందు దయాబీజములంకురించుఁగాక. వధ్యస్థానములగు కసాయిఖానలు, జీవకారుణ్యబోధనాశాలలై పరిణమించుఁగాక. సత్య, శాంతి, దయా, దాక్షిణ్య విమల విశ్వాసాది పవిత్రధర్మములచే పెంపొంది భూలోకము స్వర్గలోకమై విరాజిల్లున ట్లనుగ్రహించుటకై నిఖిలలోకరక్షకుండగు, పరమేశ్వరుని దివ్యమహిమను భక్తకోట్లనుదినముఁ బ్రార్థింతురుఁ గావుత.

స్వస్తిసర్వేషాం సమస్తసన్మంగళాని భవంతు

# విషయసూచిక

## చతుర్థలహరి.

## పంచమలహరి.

ఓం తత్సత్.

# కారుణ్యగీతము.

రాగము—కల్యాణి-ఆట.

భూతదయకుమించిన - పుణ్యము లేద - నుచుఁబల్కిరి

జ్ఞానులు ॥ ప ॥

ఘాతకులిలపాప - భీతియింతయు లేకఁ - జేతకత్తుల

బూని - దీతురసువులాహా॥ అ॥ ప॥

1. చిన్ననాఁడొక ఈగను - గడ్డితోఁగ్రుచ్చి - భిన్నపఱచిఁ జంపిన సన్నుతమాండవ్యు - డెన్నశూలమునకు। మున్ను వేయఁబడెనం - చున్నశాస్త్రమువినరే॥భూ॥

2. భాగవతమునందున - నాల్గవస్కంధ - భాగములోఁ జూడుడు। యోగీనారదుడుప్రా - చీనబర్హికిదెల్పె। మూగిజంతువులయజ్ఞ - ములఁజంపరాదని॥ భూ ॥

3. గడ్డిగాదరదినియు - నిత్యముతమ - దొడ్డిలోనికిఁజేరుచు। అడ్డులేక పనుల - నొడ్డిసేయుచుమన। బిడ్డలవలెనుండు - ఎడ్లఁజంపకుడాహా ॥భూ॥

4. సాఁకువారికిఏరువు - నిచ్చియుఁబచ్చి- యాకులఁదినికంబళ్లు। లాకుబండెమునిచ్చు - మేకగొఱ్ఱెలదిను। కాకుమనుజపులు - లాకుదయలేదాహా॥భూ॥

5. మచ్చికనడవులలో - పచ్చిక మేసి - స్వచ్ఛమౌనీరు
త్రాగి । వచ్చిఇండ్లకమృత - రుచ్యమౌక్షీరము ।
నిచ్చుగోవులఁదిన । వచ్చునె - యాహాహా॥భూ॥

6. మక్కువతో దేవుని - మరచినిద్రా । సౌఖ్యననుండు
వారిఁ । గొక్కొక్కోయనిఁగూసి యక్కటంతో లేపుఁ ।
గుక్కుటములదిను - టక్కట, ధర్మమా॥భూ॥

7. నీళ్ళనుండెడి పాచిని దినుచుమంచి - నీళ్ళనిచ్చెడిచేపల।
గాళ్ళుచేతులబండ - రాళ్ళపైమర్దించి - నోళ్ళవైచు
టయమ । తాళ్ళుముందటకవి॥భూ॥

8. వృక్షములందుండెడి - పండ్లనుదిని - కుక్షి బాధనుఁ
దీర్చెడి । పక్షిజాతులఁబట్టి - భక్షించుటెందుకు ।
కుక్షినిండదెశాక - భక్షణమున నాహా॥భూ॥

9. ఒరులకెగ్గుదలఁపక - యడవులలోనఁ - బరగుచుండెడి
సాధులౌ । హరిణాదులనుగొప్ప - యురులొడ్డిజంపుట।
సిరికాదు సరికాదు - నరకహేతువుఁగాన॥భూ॥

10. ధర్మశాస్త్రములెల్లనుఁ - బల్కునహింసా పరమో
ధర్మః - యంచును । కూర్మిసనాతన - ధర్మబోధిని
సభ్యుల్ । పేర్మివచించెడి - ధర్మమదియెవినుఁడు॥భూ॥

(శాంతిశ్శాంతిశ్శాంతిః)

ఓమ్.

శ్రీ సచ్చిదానంద గురుపరబ్రహ్మణేనమః

# * అహింసార్ణవము.

---

## ఆత్మబోధాష్టకము.

కం॥ వ్రతములలోపలనుత్తమ
వ్రతంబహింసావ్రతంబు; వాస్తవమిదిస
ద్వ్రతులగుమునివర్యులయభి
మతము నిరంతరముదీని; మరువకుమనసా॥

కం॥ కూర్మినహింసాపరమో
ధర్మంబని వేదవాణిదనరదెలుపు, నా
ధర్మమునుపాటిఁజేయుము
నిర్మలగతికిదియెబాట; నిజముగమనసా॥

కం॥ జంతువులనుహింసింపకు
మెంతయు నీచేతగాదు హింసించినయా
జంతువులప్రాణమొసఁగను
సంతతము నహింసనిష్ఠ, సలుపుముమనసా॥

కం॥ జీవముతోమనవలెనను
భావముజంతువులకెల్ల, బాగుగగలదా

---

* కారుపల్లి శివరామయ్యగారి సహధర్మచారిణి శ్రీమతి రామాంబగారిచే విరచితము సంపూర్ణగ్రంథము ప్రత్యేకముగా ప్రకటింపఁబడును:-

భావమునించుకదలఁచి, సు
భావముతోనుండుమదియె; భాగ్యముమనసా॥

కం॥ రక్తాశనముంగోరక
భుక్తికిధాన్యములఁగొంచు బొందుగధర్మా
సక్తినినుండుమిదియెస
ద్భక్తులుబోధించుదివ్యపాఠము, మనసా॥

కం॥ హితులనుగోర వెనీవిల
నతులితముగనట్టిహితుల, నవియునుగోరక్
హితమాచరించుచుండుము
సతతమునుసంతసముగల్గుసత్యముమనసా॥

కం॥ విషవర్గములహరింపక
లుషజాలమునాపుమదియె, రుచిమార్గమున
ద్విషయాన్వేషణచేదు
ర్విషయాతీతంబుఁగాంచి, వెలయుము మనసా॥

కం॥ నినుఁబోలుప్రాణివర్గమె
యనువుగనోరెఱుఁగనట్టి, యాజంతువులక్
చనువుగనీక్షింపుమునీ
వనవరతమునుమరువబోకు; మాత్మనుమనసా;

కం॥ ఉద్భూతమైనయీఘన
సద్భోధాష్టకుసుమముల, సాహాయ్యముచే
హృద్భవనపూర్ణునీశుని
సద్భావార్చనము నెపుడు, సలుపుముమనసా॥

ఓమ్, తత్, సత్,

(సశేషము.)

# ఈశ్వర పూజ

శ్లో॥ అహింసాప్రథమంపుష్పం । పుష్పమింద్రియనిగ్రహం ।
సర్వభూతదయాపుష్పం । క్షమాపుష్పంవిశేషతః । శాంతి
పుష్పంతపఃపుష్పం । ధ్యానపుష్పంతథైవచ । సత్యమ
ష్టవిధంపుష్పం । విష్ణోఃప్రీతికరంభవేత్ ॥

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండగు పరమేశ్వరుని దివ్యమహిమను వర్ణింపుచు, నాదయానిధినిఁ బూజింపుచు, తదీయ పవిత్రచారిత్రముల నాకర్ణింపుచు, తన్నామామృతమునుఁ గ్రోలుచుండువారే ధన్యులు. అట్టివారే మోక్షపదవికర్హులు అణురేణుతృణకాష్ఠ స్థావరజంగమాది సర్వప్రపంచ వ్యాపకుండగు నా పరిపూర్ణానందమూర్తినిఁ బూజించుటకు కొన్నివిధులుకలవు. రోగికి దివ్యౌషధమునిచ్చినను, పథ్యము సరిగానుండనిచో నెట్లు వ్యాధికుదరదో. అట్లే భగవదారాధనమునకుఁ గొన్ని (పథ్య) నియమములు కలవు. ఆనియమము లీక్రింద వివరింపఁబడుచున్నవి.

అఖండజ్ఞాన పరిపూర్ణులగు భక్తులు, ముక్తులు, యోగులు, త్యాగులు మానులు మున్నగు మహాత్ములు దేనిని లోకులకు బోధించిరో, దేనిచే రంతిదేవాది భూకాంతులు సంతతశాశ్వత యశఃకాయులై, దిగంతవిశ్రాంతింగడించిరో, ఏధర్మమును నమ్ముకొని యరణ్యవాసినులైన మునిసతులు దేవతానివేదనము కాలేదని యాటంకపఱచిన భర్తృవాక్యములనుఁగూడ లెక్కసేయక కృష్ణాదిగోపాలకుల, కన్నపానాదుల నర్చించి ముక్తిఁగాంచిరో దేనికొఱకీ గ్రంథము నిర్మింపఁబడినదో; అట్టి పరమధర్మమగు అహింసాది

వా మాంతరములతోఁ బరగుచుండు జీవకారుణ్య మను మహాపుష్పము ఈశ్వరపూజకు మిక్కిలి ప్రధానమైన దివ్యసుగంధముతో గూడిన మొదటి కుసుమము. అనఁగా; "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి,, యను గీతావాక్యమునుగట్టి దిట్టముగాభావించి బుద్ధిపూర్వకముగా ఏసాధు ప్రాణికిని హింసచేయక నన్నిటియందును దయగలిగియుండువారు సదా ఈశ్వరపూజచేయుచుండువారే యగుదురు. ఈపుష్పమునకుఁదోడుగా,ఇంద్రియనిగ్రహము, సర్వభూత దయాళుత్వము, క్షమము, శాంతి, తపస్సు,తదేక ధ్యానము, సత్యము అను నీయెనిమిది పుష్పములతో నిశ్చయముండగు నీశ్వరుఁబూజించుచుండవలెను. ఇవి ఎనిమిది పుష్పములనియూ, లేక ఈశ్వరుని నారాధించుటకనువగు హృదయము మను దివ్యపుష్పమున కివి రేకులనియు పెద్దలు వేనోళ్ళవక్కాణించియున్నారు.

ఆ. వె: అరయ దేవదేవు నారాధనముసేయ।
సప్తదళసుమంబు లమరవలయు।
దీనిదెలిసికొనని దేవునిపూజేల।
విశ్వదాభిరామ వినరవేమా॥

అని పరమవిజ్ఞానవిశారదులగు వేమనగారానతిచ్చియున్నారు:—శ్రీ

---

# ఊర్వసుతోద్వాహము

## గ్రంథకర్త

మ॥ రా॥ శ్రీ ఇక్కుర్తి తిరుపతిరాయఁడుగారు (బాలకవి) ఇందలి శైలి యద్భుతమని ప్రశస్తనీయులగు పండితపుంగవులచేతను, ఆంధ్రపత్రిక రంగూన్ తెలుగు పత్రిక మున్నగు పత్రికలయందును. బొగడ్త గాంచినది.

వెల ఇతరులకు రు 1 0 0.    చందాదారులకు రు 0 12 0.

# అవతారిక

ఏ దేశము పరమతపోధనులును, అహింసా వ్రతపరాయణులును, అఖండబ్రహ్మచర్య నిష్ఠాపరిపాలకులును, వేదవేదాంత విజ్ఞానవిశారదులును, పరమ కారుణ్య పరిపూర్ణులును, నగు ఋషిపుంగవుల కాలవాలమై యుండెనో; ఏ దేశము పరతర ధర్మానుష్ఠాన పరిశుద్ధులగు గృహస్థులకు జన్మస్థానమయి యుండెనో; అద్వితీయ తత్త్వవిద్యా ప్రభావముచే ఏ దేశము (Land of Philosophers) తత్త్వవేత్తల భూమియని ఖండాంతర పండిత ప్రకాండులచే నయితము పొగడ్తఁగాంచెనో, అట్టి పవిత్రభూమియగు భరతఖండ మిప్పుడొక ప్రధానవిషయమున మిక్కిలి హేయమగుదుస్స్థితి నొందుచున్నది. ఎచ్చటఁజూచినను గోవధలు, ఏవంకఁజూచినను మాంసభక్షకులు ఏయూరఁజూచినను మధుపానమత్తులు, ఏయింటఁజూచినను త్రాగుబోతుల దురాగతములు, ఏవీధిఁజూచినను మద్యపానమందిరములు, ఏసందుఁగనుఁగసాయిఖానలు. ఆహా! భరతఖండమున కెంతటిదురవస్థ సంభవించినది? మద్యమాంసభక్షకులమధ్యమునం జిక్కికొని మిడకరింపవలసినగతి ఆర్యులకు సంభవించినది. ఎంతఘోర మెంతఘోరము!! ఇట్లగుటకుం గారణమేమి? సందేహ మేల? "సహవాసయా పుణ్యా గుణాభవంతి; సహవాస దోషాగుణాభవంతి," యని ఆర్యులు వక్కాణించియుండలేదా? అదియే కారణము. అయ్యది నిస్పష్టము గానే యున్నది. భూతదయాపరిపూర్ణచిత్తులగు ఆర్యసంతతిలో మద్యమాంసప్రధానంబగు దురాచారం బెప్పుడు తలచూపెనో ఆ నాటినుండియు నీదుర్వ్యాధిక ప్రబలుచువచ్చెను. పరమపవిత్రములగు సద్గ్రంథముల యందెల్లెడల మాంసాహారము సనాతనమయిన సదాచారమను బ్రక్షిప్తములు గ్రుచ్చఁబడినవి. తుదకవియే విచారజ్ఞానశూన్యులకుఁ బరమ ప్రమాణములయ్యె. ఐన నేమి? Truth crushed to earth seall rise agaiu, అనువాక్యముచొప్పున నిజమునిలకడమీదనయినఁ దేటపడకమానదుగదా? జీవహింసాసక్తమనస్కులగు కిరాతబుద్ధులను వివేక మెఱింగించుటకయి మహనీయు లెందఱెందఱో యవతరించి జీవహింసనుఁ జాలవఱకు రూపుమాపి ధర్మసంస్థాపన మొనరించిరి. అట్టియు నీదుర్వ్యాధిక మరల, నానాటయభివృద్ధిఁజెందుచు నేయున్నది. ఈవిషయమట్లుండ; మద్యమాంససేవనము మహాదోషకరమను సంగతిని పెద్దలు చెప్పగా విని, జీవదయాపరులం కొందఱాదురాచారమునుండి తొలఁగిపోవుచుండగా, నట్టివారి నెదురించి దుర్వాద ప్రియులుకొందఱు, మాంసము నేలతినరాదు? దానిలోదోష మేమి

శాస్త్రములలో మాంసభక్షణము విధింపఁబడియుండలేదా ? యను నీమొదలకు వితండవాదముల కుపక్రమించుటచే, శాస్త్రీయగ్రంథావలోకన మంతగాలేని యీ జీవదయాపరులట్టి వైతండికులకుత్తరము చెప్పఁజాలక, వారి ధాటికి వెరగంది భ్రాంతిజెందుటతో ఇఁకమిద్ధమని నిర్ధరించుకోలేక మరల తాము మాంసభక్షణమున కుపక్రమించుచుండుటను స్వయముగ వీక్షించడమయినది. మిక్కిలిశోచనీయమగు నీదురవస్థ-సకలజనాభివర్ధనీ- సనాతన ధర్మబోధనీ, సభాసదులచిత్తముల కాందోళనముఁగలిగించినది. శ్రీయుతులగు ముఖాసిబారందూరు దేవయ్యగారుఁ సంఘాధ్యక్షులును, కెలమంగలవాస్తవ్యులగు శ్రీయుత, వెంకటరమణప్పగారు, మున్నగు మిత్రమండలియుఁ జాలవఱకీ దురాచారమును మాన్పయత్నించి క్రియారూపముగాఁ బరీక్షించియందులో జనులకీయాచారమునుఁ దెలియఁజెప్పుటలో కొంత మేలుకలదని విశదమయినది. అంతట మన్మిత్రులగుశ్రీయుత వేంకటాచార్యులయభిమతముచొప్పున వారిసహాయమునుబొంది, వితండవాదులఁగురభిప్రాయమును ఖండించి శాస్త్రీయ ధర్మములను స్థాపించుట కనువు " నుండునటుల ఈగ్రంథమును నిర్మించడమయినది. ఇందు స్వదేశీయ విదేశీయపండితుల వాక్యములు సాధ్యమయినంతవఱకు సమగ్రముగాఁజేర్పఁబడియున్నవి. ఈగ్రంథమును విమర్శఁజేయువారగు ఖండన పక్షమువారు పక్షపాతమునాలోచనములందీసివైచి ధర్మసమాలోచనఁజేయువారయియుండవలెనని మాప్రార్థన. ఈగ్రంథమునందలి యభిప్రాయములను మిత్రవరులును పండితులును, నగునేకులలంకరించియుండుటచే "మా ప్రార్థన" యను బహువచనమే వాడఁబడియున్నది.

ఇందలి విషయములు, జనసామాన్యమున కంతకును తేటతెల్లంబయియుండవలెనను నూహతో సందర్భోచితముగఁ బెక్కుచోట్లయందు సంధులను సంధింపలేదు.

అస్మద్దేశీయులగు కరుణాళువులారా ! ఈపొత్తమునందలి యభిప్రాయములను మీరు సాధ్యమయినంతవఱకు మద్యమాంససేవకులకు బోధించి, వారినిదురాచార పిశాచప్రవాతినుండి తొలఁగించి భరత మాతకు మరలఁబూర్వకాలపు టౌన్నత్యమునుఁగలుగఁజేయుఁడు.

గోపీ జనవల్లభుండును, గోగణరక్షకుండును, గోవర్ధనోద్ధరుండునునగు, గోపాల కృష్ణుఁడు సదయుఁడయి రక్షింపఁగలఁడు.

ఓమ్, శాంతిశ్శాంతిశ్శాంతిః.

# గోహత్యవలనఁగలిగెడి కష్టనష్టములు.

ఇతర దేశములవలెఁ గాక మనహిందూ దేశములో ముప్పాతిక భాగమునకంటె నధికముగా జనులువ్యవసాయమువలన జీవించువారయి యున్నారు అటుల ప్రాణాధార వృత్తియగు వ్యవసాయమునకు, ఆవులు, ఎద్దులు మేకలు, గొఱ్ఱెలు. ముఖ్యమగునవి ప్రధానాంగములుగానున్నవి. అట్టిగోవులను జంపుటవలన దేశమున కెంతకష్టనష్టములు ప్రాప్తించుచున్నవో ఆవివరమీక్రింద వ్రాయఁబడుచున్నది. మంచి బలిష్టమయిన ఆవు దినము 1 కి 20 ఇరువది సేర్లపాలియ్యఁగలదు. సామాన్యమయిన ఆవు 2 రెండు సేర్లపాలియ్యఁగలదు. సరాసరి మొత్తముమీఁద నొకయావు దినమునకు 11 పదునొకండుసేర్ల పాలిచ్చునటులేర్పడును. కొన్నియావు లొకటిన్నర సంవత్సరమువఱకు, కొన్ని ఆరునెలలవఱకును పాలిచ్చును. సరాసరి ఆవులొక యేడాదిపాలిచ్చుచుండును. ఇట్లుప్రతిగోవును తనజీవితకాలమునం దొసఁగుచుండుపాలు సాధారణముగ 24960 ఇరువదినాలుగువేలతొమ్మన్నూటయరువదిమంది మనుష్యులొక పర్యాయమునందృప్తిబొందుటకుఁదగిన యాహారమగుచున్నది. ఒకగోవు తనజీవితకాలమునందు 6 ఆరు పెయ్యదూడలను, ఆరు కోడెదూడలను ఇచ్చుననుకొందము. ఇందు 2 రెండుగతించినను సరాసరి పది నిలుచును. అందు 5 ఐదు పెయ్యదూడలును తమతమ జీవితములయందు; 124800 లక్షయిరువదినాలుగు వేల యెనుమన్నూరు మనుష్యులను తమపాలచే తృప్తిపఱచును ఇఁక మిగత ఆరుయెద్దులును తమజీవితకాలమునందు కనీసము 5000 ఐదువేలమణుఁగుల అన్నమునకు వలయుధాన్యము నుత్పత్తిచేయుటకు సహా

రములగును. ఈ అన్నమును మనుష్యుఁడు ప్రతిఒక్కంటికి మూఁడు పాళ్ళవంతున తిన్నను; 250, 000 రెండులక్షల ఏబదివేల మనుష్యులకు ఆహారమగుచున్నవి. ఇటుల రెండింటిని సరిచూచితిమేని ఒకగోవు తనకాలమునందు 475600 నాలుగులక్షల డెబ్బదియైదువేల ఆర్నూరు మనుష్యులనొకపర్యాయము తృప్తిపఱచును. కొంచెమెచ్చుతక్కువగ (మహిషము) ఎనుములను గూడ నిట్లే పోల్చవచ్చును. మేక అథవా గొఱ్ఱె తనజీవితకాలమున సరాసరి 25920 ఇరువదియైదువేల తొమ్మనూఱ ఇరువది (మంది) మనుష్యులు తృప్తి పొందుటకు దగినపాలొసంగును. మరియు ధాన్యమును పండించుటకుఁగూడ తోడ్పడును.

కాబట్టి ఒకగోవును హత్యచేసినవాఁడు 399760 మూఁడులక్షల తొంబది తొమ్మిదివేల ఏడువందల అరువది (మంది)మనుష్యులను చంపినవాఁడగును. ఇట్లే గేదె, మున్నగు వానిని జంపినవాఁడును కొంచెమించుమించుగ పైనఁజెప్పిన జనసంఖ్యను వధించిన పాపమునకు గుఱియగుచున్నాఁడు. ఒక మేకను లేక యొకగొఱ్ఱెను చంపినవాఁడు సరాసరి 25920 ఇరువదియైదువేల తొమ్మనూఱ ఇరువది మనుష్యులను జంపినవాఁడగును. గొఱ్ఱెయున్ని (బండము) చేతనే కంబళ్ళుమున్నగునవి తయారుచేయఁబడుచున్నవిగదా; ఓ, ఆత్మబంధువులగు సోదరులారా! ఆర్యవంశోత్పన్నులారా! అహింసావ్రతపరాయణులయిన ఋషిమునుల వంశమునందవతరించినభగవద్భక్తులారా! జీవజంతువులను కరుణించి దరిజేర్చి రక్షింపుడు! కాని వధింపకుడు!! దయఁజూడుడు! ధర్మసూత్రములనుగనుడు! భూతదయయే పరమమంత్రము; అదియే పరమ వ్రతము; అదియే పరమవైరాగ్యము. అదియే మోక్షమార్గము. అదియే ఈశ్వరప్రీతికరము! ఇదిసత్యము!! సత్యము!!!

ఓపరమేశ్వరా! ఆర్తత్రాణపరాయణా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! జీవకారుణ్యమూర్తీ! ఇదిమావ్యవసాయము. దీనిపయి నీదివ్యకటాక్షము.

ఓమ్ తత్సత్ - శ్రీపరమేశ్వరార్పణమస్తు.

# భరతమాతృ విలాపము

భరతమాత:—

కం॥ ఈశ! పరాత్పరగనుమిల
లేశముఁగనికరముమదిని లేకకిరాతుం
డాశించిమాంసమునకా
వేశముతోగోవుతలను ద్రేసెడినసిచే.

శా॥ ఆహా నేనిపుడేమిసేయుదుఁగటా. హాగోగణంబెల్లని
ద్రోహా వేశపిశాచకర్కశులచే,ధూళీకృతంబయ్యెడిన్
ఓహా దేవసుభావక్షిప్రముగనీ యుత్పాతకంబున్ భవన్
మాహాత్మ్యంబుననైనభూతలమునన్ మాన్పించిరక్షింపవే.

కం॥ కత్తులనెత్తుచు గోవుల
కుత్తుకలనుమోదుచుండు, క్రూరులనకటా
అత్తమ్మిచూలిమేలా!
యిత్తెరునసృష్టిఁజేసె, నీధారుణిలో!

చం॥ కరుణయొకింతలేకమదిఁ గానకదుర్గతి భీతినిట్లిలన్
నిరతముఁగోగణంబు నలనెట్టుచుజేర్చి వధాలయంబులో
గరకరిఖడ్గధారలకు, గాంతునొసంగుచునాహుతిన్ భయం
కరులగురాక్షసాంశజులక్రౌర్యముమాన్పవెలోకనాయకా!

కం॥ ఈపాపము భూలోకము
నేపాటికి దెచ్చెనహహా! హేయాత్మకులా
కాపురుషు లెవరిల్లి ధరి
తాపము వారించి పశుల, దయగను దేవా!

కం॥ ఓపరమేశ! పరాత్పర!!
పాపాత్ముల చేతఁజిక్కి పశుగణమకటా!
వాపోవుచున్నది యా
తాపమును హరింప వేల, ధన్యచరిత్రా!!

హా! దీనదయాళూ!! విశ్వజనకా! కరుణాసముద్రా! లోకములో జీవహింస యెంతలేసైనది? అకటా! తలచుకొన్నంతనే గుండెలవియు చున్నవే! పరమేశ్వరా! ఘోరవ్యాఘ్ర భల్లూకములకంటె ఘోరకఠిన చిత్తులై కోరికోరి మీరిమీరి ప్రాణుల హింసించుచుండు నూరికిరాతుల చే నానాడు వేలకొలఁది జీవజంతువులు వధింపఁబడుచున్నవి గదా? అకటకటా పశుసంతానమునకెట్టి దురవస్థ సంభవించినది!! (వ్యాధ్యస్థానములగు) కసాయి ఖానలనుఁజూచినవో సాధువులగుండె లవిసిపోవుచున్నవే!

లయగ్రాహి.

1\. మత్తులగు రైతు లిలబిత్తరపుమాటలను మొత్తముగ గోవు లను పొత్తుగొని చనుచుఁ । చిత్తమున పాపమును పొత్తులవ లేశమును నత్తరి తలంపకయె కుత్తుకలనఱుకన్ । మొత్త ముగబారుపెను నెత్తురునదంబులయి, దత్తరముతో నలువ గుత్తుకలు మోదన్ । రిత్తయయి నేలఁబడఁజొత్తిలెడి మాంస ముల, నత్తలముతో మెసగి నృత్తములొనర్తుర్.

కం చకితమువీరలు దనుజులు
నొకటేకా కరయ భేద, మున్నదెవ్వాడన్
ప్రకటింప దగదెయికధర
నకటా! వీరలను కలియుగాసురులనుచున్

ఆ॥ జీవకరుణలేక, చెడుగనిందలపక
భావమందు ధర్మ, భావమిడక
మద్యమాంసభుక్త, మత్తులై చెడకుడీ
ఘనమదాంధులైన, దనుజులార.

కం॥ వాపోవుచునంభాయని
చూపరులమనంబులెల్ల, సుడివడనెంతే
దాపంబున నీల్గుచుదమ
పాపంబులఘాతుకులకుఁ, బంచున్ బశువుల్,

కం॥ సారెకు జంతువులసువుల
ఘోరవ్యాఘ్రములరీతిఁ గొనియెదరకటా!
వీరేకదయసురులుధర
నారయఁబ్రాణములఁదీతురక్రమమనకన్.

కం॥ తమిఁబిశితముఁదినుటంబిశా
చములనఁబఱఁగ్రవ్యమైన చవిగొనితినుటన్
గ్రమమగు గ్రవ్యాదులనన్
గ్రమహీనమ వారువీరనంగామదిలో.

క॥ ఫలములసస్యాదులనిల
నెలమిందిసికాదెమాంస మెంతయు నెనయన్
పలుతెఱఁగులఁ బ్రాణులమెయి
జలము న,గవుచుకయి ప్రాణిఁ జంపగ నేలా.

క॥ లలిరుచుల వెలయు ఫలముల
బలకరసద్ధాన్యతతులఁ బ్రాణులకై సాం
పలరగ నొసగిన దేవుని
కొలయుసచేతనములెల్ల నొకటియగాదే.

క॥ హయ ధేను మేష కుక్కుట
చయభక్షకులారజీవిశాత్రవులారా
భయసహిత జంతువులయెడ
దయగనుడీదైవభక్తి తత్పరులగుచున్.

క॥ ఒకనాఁడు మంటఁగలియదె
యకటాయీదేహమిట్టి యల్పంబునకై
బకవృత్తులెంచుకయ్యో
యికనయినను జంతుతతుల యెడదయఁగనుఁడీ.

క॥ పనిబూని జంతువితతిని
యనయముఁజంపించువారు నటుజంపెడివా
రెనయగవండి తినెడివా
రును ఘాతకులండ్రిమనుగురు ప్రముఖులిలన్.

అయ్యో! తుదకు జంతువులను దేవతలకే బలియిత్తురట. అకట ఇదియెట్టి దైవభక్తి.

కం॥ కూర్మినహింసాపరమో
ధర్మమ్మనుచు శ్రుతివచించు తగనెఱుఁగుచు సు
త్కర్మములనుఁ దొలఁగెఱు స
త్కార్యములెగద? దైవభక్తి తత్పరులనగన్.

(అని విలపించుచుండగా)

అదృశ్యవాణి:—ఒక్క కసాయివారేకాదు. దేవతలకు బలియిచ్చునెపంబున, ననేకులు జీవహింస చేయుచున్నారు.

భరతమాత.—అకటా! దేవతలిట్టి బలినిఁగోరుదురా? వారికి దివ్యమైన అమృతమున్నదిగదా దానిని విడచి ఈ జీవహింసారూపమగు మాంసాశనము నపేక్షింతురా? ఒకవేళ జిహ్వాచాపల్యబద్ధులై దేవతలేమైన నీకార్యమునకుఁ జోటిచ్చియుండిరేని, పరమేశ్వరునిచే వారును శిక్షింపఁబడకమానరు.

ఇఁక నేనేమి చేయఁగలను. “దైవంమానుషరూపేణ,” యని మహాత్ములనెడివారు. ఇట్టి కాలమున ఋషులుదక్క నాకు దిక్కెవ్వరు?

ఓ సూక్ష్మశరీరధారులగు మునికులోత్తములారా! పరమకారుణ్యచిత్తులగు మీదివ్యమహిమచే భూలోకవాసులకు అహింసాధర్మమును బోధింపుఁడు. జీవహత్యలను మాన్పింపుఁడు!! కరుణింపుఁడు.

ఋషులు :—(అదృశ్యముగా) కల్యాణీ; భద్రమస్తు; భద్రమస్తు; తల్లడింపకుము. ఈవఱకే భూలోకమందంతట నహింసాధర్మబీజములను నాటినారము. అవి త్వరగా మొలకలెత్తగలవు, మేమును మాయోపినంతవఱకే దురాచారమును రూపుమాపెదము. శాంతింపుము శాంతింపుము.

భరతమాత :—ఆర్యులారా! చిత్తము! చిత్తము!!

ఓమ్.

# జీవకారుణ్యము

---

## ప్రథమలహరి.

### పూర్వాచారము.

కం॥ ఎఱుకఁగల వారిచరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ, గదలకధర్మం
బెఱుగుచు నెఱిఁగిన దానిని
మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్.

(శ్రీమహాభారతము.)

సకలలోక రక్షకుండగు పరమేశ్వరునిచే సృజింపఁబడిన యనంతజీవకోటిలో మానవజాతి మిక్కిలి శ్రేష్ఠమైనది. మోక్షాధికారముఁగలది. మనుజులలో జ్ఞానులుత్తములు. వారిచిత్తము లపారకారుణ్యాయత్తములు. వారిచేత లపారదయాపరిపూర్ణములు. అట్టివారు వశిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, పరాశర, వ్యాస, భరద్వాజ, శుక, శౌనక, అత్ర్యంగిరసాదులు. పరమతపోధనులగు నీమహానుభావులు నిత్యముక్తులైనను పామరుల నుద్ధరించుటకై యనేక ప్రయత్నములు సలుపుచుందురు. ఈ మహాత్ములు స్థూలశరీరము లంద్యజించి సూక్ష్మలోకవాసులగుటచే భూలోకవాసులకు నీతిం దెలుపువారు మిక్కిలియరుదై జనులు నానాట దురాచార పిశాచగ్రస్తులై పోవుటకు హేతువేర్పడినది. ఆర్యులు అహింసావ్రతపరాయణులు. అనార్యులు జీవహింసాపరాయణులు.

## — (*) ఆర్యానార్యవిచారము. (*) —

"విజానీహ్యార్యాన్యేచ దస్యవో బర్హిష్మతే రంధయా
శాసదవ్రతాన్॥ "

(ఋగ్వే-మం-౧-సూక్త-౧-మం-౮)

ధర్మాత్ములును, ఈశ్వరుని దివ్యమహిమ నెఱింగినవారును, భూతదయ పశ్చాత్తాపచిత్తులును, సదాచారసంపన్నులును నగు మహాపురుషులకు ఆర్యులను పేరు సార్థకమగుచున్నది.

ఆర్యాచారములకు విరుద్ధములగు జీవహింసాది దుష్కార్యములయందలవాటుపడి, సదా మద్యమాంసరతులైయుండు క్రూరస్వభావులకు అనార్యులు, లేక దస్యులని పేరు. సదాచారసంపన్నులగు ఆర్యులను దురాచారరతులగు దస్యులు పూర్వకాలమునుండియు ద్వేషించుచునే వచ్చిరి. దయాశూన్యులకును, దయావంతులకును మైత్రిపొసగదుగదా ? వ్యవహారములయందెటుల యుభయులకును సరిపడలేదో, ఆహారమునందును అట్లేసరిపడలేదు. ఆర్యులమృతపదార్థభక్షకులు. అనార్యులు మృతపదార్థములనే గాక నిషిద్ధపదార్థములనుఁగూడ సేవింపనారంభించినవారు. అందుచేత వారికిని వీరికిని మైత్రి పొసఁగకపోయినది, ఉభయులకును పోరాటమధికమైనది ఈ ఆర్యానార్య సంగ్రామవాసన నేటికిని విడువకున్నది. ఆర్యుడెవఁడైన నొకచోట అహింసాధర్మమును బోధింప నారంభించెనేని అనార్యలోక నూరుమంది దానిని విఘ్నపరతురు. జనులారా! హెచ్చరిక. హెచ్చరిక. అనార్యులమాట వినకుఁడు. అటుల ఆర్యులసహవాసము చేయని విద్యాగంధశూన్యులగు పామరులు రాక్షసాంశాసంభూతులైన (మద్యమాంసప్రియులగు) వామాచారులవలలోఁబడుటచేత జీవహత్యలు చేయుటకు హేతువేర్పడుచున్నది. ఆహా! సహవాసదోష మెంతటిపనినైనఁ జేయింపగలదు. దీనినే "సత్సంగత్వే నిస్సంగత్వ" మని ఆదిశంకరులు చక్కగా వక్కా-

ణించిరి. శంకరులొక్కరే గాదు; విజ్ఞానపరిపూర్ణులగు వారే దేశమందున్నను వారందరును నిట్లే వచించియుండక మానరు.

Let a man enter upon any evil course and at once he will find himself, by the law of his nature, in the company of those who have adopted the same course. Let him enter upon any good course and by the same law he will become associated with the doers of that good.

(The light of reason.)

సజ్జనసాంగత్యమువలన సత్ప్రవర్తనము పట్టువడును. దుస్సాంగత్యమువలన దుఃఖముకలుగును. అన్నిటికిని, అభ్యాసమే కారణమనుటకీ క్రింది విషయము చక్కని నిదర్శనముగనున్నది.

అలవాటుయొక్క బలము—జతచెలికత్తెలిరువురుకలరు. వారు జవ్వనులయి వేరువేరు స్థలములందుండిరి. వారు మరల నొకవాడంగడిలో కలుసుకొనిరి. వారిలోనొకతె పువ్వులమ్ముచుండెను. రెండవది చేపలమ్ముచుండెను. చేపలమ్మ స్నేహితురాలిని పువ్వులావిక చూచి పోల్చి తనయింటికి గొనిపోయి విందుచేసెను. పిమ్మట వారిరువురు పువ్వులున్నగదిలో పండుకొనిరి. సుగంధము గదినిండియుండెను. పువ్వులావికకు నిదురపట్టెనుగాని చేపలదాని కావాసనగిట్టలేదు. పూలవాసనవలన తలనొప్పివచ్చినది. కన్ను మూతపడలేదు. కాన మెల్లనలేచి తన చేపలగంపదెచ్చి ముక్కుదగ్గర పెట్టుకొని ఆవాసన నాఘ్రాణించుచు పరుండగ దానికి నిదురపట్టెనట.

(సువర్ణలేఖ)

మాంసభక్షకుడగు నొకనితో నాయనా! మాంసము దినరాదు. ఇక దానిని వదలి పెట్టుము, అని చెప్పగా నతడిట్లనియె.

మాంసభక్షకుడు:—మాంసభక్షణము బహుకాలమునుండి వచ్చినది. మా పితరాచారము

శాకభక్షకుడు:—పితరాచారము కాదు. మిక్కిలి దురాచారము

మాం:—పూర్వాచారమును విడువరాదు. అప్పుడు లేని మార్పులిప్పుడు చేయరాదు.

శా:—అప్పుడు లేనివేవియు నిప్పుడు లేవా? అప్పుడు లేనివైనను మంచి పద్ధతుల నిప్పుడేల చేయరాదు.

మాం:—మేము పూర్వాచారమును మీరువారము కాము. అప్పుడు లేనివిప్పుడు మాకుఁ బనికిరావు.

శా:—మీరు పొరపడినారండీ! పూర్వీకులు రైలుబండ్లనెక్కిరా? లాంతరులు, లస్తరులు, గుళ్లోపులు వెలిగించిరా? కొవ్వొత్తుల నుపయోగించిరా? మీరేల వీనినుపయోగించెదరు. పూర్వీకులు కంబళ్ళు, దుప్పట్లు కట్టుకొనుచుండిరే? మీరేల శాలువలు, జరతారిబట్టలు, ట్వీడులు, మఖమలులు, బనారసుపాగాలు, పీతాంబరములు: ఆల్పాకులు మరి చిత్రవిచిత్రములగు వెన్నిటినోఁ గట్టుకొనెదరే? పూర్వీకులు చకుముకిరాతితో నిప్పుకలిగించుకొనుచుండిరే? మీరేలచీ వాదీపముకండ్లువాడెదరు- పూర్వులు దేవాలయములలో తైలఘృతములతో దీపములంటించుచుండిరే? మీరేల దేవతా ఉత్సవాదులందు ల్యాంపునూనె దీపములు, గ్యాస్‌లైటులు, కొవ్వొత్తులు వెలిగించెదరు? పూర్వము లేనివెన్నియో ఇప్పుడు వాడుకయందున్నవి. చెప్పఁబోయినచో నిట్టివెన్నియోఁగలవు. వానితోఁ బ్రయోజనమేమి? పూర్వమున* లేనివైనను, మంచిపనుల నిప్పుడె వాడుకకుఁ దేవచ్చును.

మాం:—ఔను? మీరిప్పుడు చెప్పినది మన తాతముత్తాతలకాలపుమాటలు రైలు, స్టీమరులు, వారికాలమున లేవేకాని వారికంటే పూర్వులగు ఆర్యులకాలమునందన్నియు నుండినవి. రామాయణ భారతాదులయందుఁ జూడుడు. ఎన్నియోచోట్ల వాయువేగ, మనోవేగ, విమా

*ఇచ్చట పూర్వమనగా యవనదండయాత్రకిటీవలి కాలము.

నవేగ జలయంత్ర* ములను గురించియు, విద్యుద్దీపములను గురించి యుఁ† జెప్పఁబడియున్నది. ఆకాలపుమాట కదా మనము నమ్మవ లెను. అదియేకదా పితరాచారము?

శా:—భలా! బాగున్నది. నేను కోరినదియునదియే. వేదశాస్త్రములయం దును రామాయణ భాగవతాద్యగ్రంథములయందునుఁ జెప్పఁబడియుం డునవే మనకు ముఖ్యానుష్ఠేయవిధులు. వానినే నమ్మవలెను. ఆకాల పువారికే బూర్వికులను పేరుచెల్లును. కావున నట్టివారననుసరింపని దురాచారములను మనము విడిచిపెట్టవలెను. దీనినే!

శ్లో॥ యేనాస్యపితరోయాతా యేనయాతాః పితామహాః
తేనయాయాత్సతాంమార్గం తేనగచ్ఛన్నరిష్యతే॥
(మనుస్మృతి)

అని పితృపితామహ ప్రపితామహులలో సత్పురుషులైనవారననుస రించినమార్గము మాత్రమే మనమనుసరింపవలెను. «విపరీతంతు వర్జయే» త్తనుటచే సదాచారుల మతమునకువిరోధమైన వేదైన పితృపితామహాదుల యందున్నచో వానిని విడనాడవలెను,

మా:—మీరుచెప్పునదినిజమే. మాచార్యులు మద్యమాంసములను సేవించు చు, ఘటార్చనము చేయుచున్నారు. అది సదాచారమని వారు చెప్పుచు న్నారుగదా

శా:—అది మీయాచార్యుల యవివేకము. వారు జిహ్వాచాపల్య బద్ధులై యుండవచ్చును. అట్టివారి నాచార్యులనుటకంటె దురాచారులన టమేలు. వారి మాటలు నమ్మరాదు,

మా:—వారికనేక బిరుదులుకలవు. అట్టివారిని నయితము నిరాకరింప వచ్చునా.

---

*శుకనీతి. †శ్రీనాథుని నైషధ మహాకావ్యము.

శా:—దురాచారులగు వారట్టివారైనను. వారిమాత్రాతలైనను వారికెన్ని బిరుదులున్నను, నిరాకరింపవచ్చును.

సీ॥ భట్టరాచార్యుల బట్టలుకాగానె
మడిగట్టుకొను పట్టుమడతలానె
అలరాచకూతురు అధరంబుకాగానె
తేనెజిక్కనె యనుపానమునకు
అల్లయేతేశ్వరోపాధ్యాయుబుట్టియు
రాచూరిగొప్ప ఫిరంగియానె
అలతాళ్ళపాక చిన్నన్నరోమములైన
తంబురుదండెకు తంతులానె

గీ॥ హుంకరించిన నెలువంటిమంకునైన
దిట్టవలయును సద్ధర్మదిట్టమిదియె
మాదరిపువిఘాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్తసంత్రాణశీల.

అను నీతికారుని వచనముచొప్పున గొప్పబిరుదులున్నంతనే అట్టివారుచేయు పనులన్నియు మంచివనితలంపరాదు. ఈశ్వరుఁడిచ్చియుండు బుద్ధినిఁ బ్రయోగించి నిజానిజములను గుర్తెరింగి సత్యమును గ్రహించి సదాచారమునందే ప్రవర్తింపవలెను.

## —(*)మృతామృత పదార్థ వివేచనము.(*)—

ప్రపంచమునంగల, అచేతన పదార్థములన్నియు (1)మృతపదార్థములు (2) అమృతపదార్థములు (2)నిషిద్ధపదార్థములు, అనిమూడువిధములుగా భాగింపఁబడియున్నవి.

వానివివరమెట్లనగా!

## (1) మృతపదార్థములు.

"నష్టేమూలే నైవఫలం నపుష్పమ్" (వృద్ధచాణక్యము అధ్యా ౧౦)

ఏపదార్థమును మనము గ్రహింతుమో దానిమూలపదార్థమునకు నాశనము సంభవించుటేగాక, అదినశించుకాలమున దానికి సంభవించెడి దుఃఖానుభవములను (ఛేదక వీక్షకులకు) దోపజేయునో అవి మృతపదార్థములనఁబడును.

### దృష్టాంతము

మాంసము తినఁగోరువారు పశువును వధింపవలెను. అప్పుడు మాంసమునకొక్క మూలపదార్థమగు పశువునశించిపోవును. దానిమరణావస్థ, వధచేయువారికి గోచరించును. కావున నది మృతపదార్థమనఁబడును.

ఇట్లే తక్కినవి.

## (2) అమృత పదార్థములు

ఏవస్తువును మనము గ్రహింపనెంతుమో। దానిమూలవస్తువునకుహాని లేకుండుట.

### దృష్టాంతము

చెట్లనుండి పండ్లనుగాని పుష్పములనుగాని గ్రహించినప్పుడును' గోవుయందు పాలుపిండుకొన్నప్పుడును మూలపదార్థములకేమియు హానికలుగదుగదా. కావున నవి- అమృతపదార్థములనఁబడును.

## (3) నిషిద్ధ పదార్థములు

"బుద్ధింలుంపతి యద్ద్రవ్యం మదకారితదుచ్యతే"*

దేనిని సేవించుటచే మానవులబుద్ధినశించి ఇంద్రియములుచెడి, పలువిధ రోగము లుత్పన్నమై వికారముగలుగఁజేయునో అట్టివి నిషిద్ధపదార్థములు.

---

*శార్ఙ్గధర అ 4 శ్లో 21-

## దృష్టాంతము.

కల్లు, భంగు, సారాయి, అపిని, మున్నగునవి. వీనిని సేవించువారిస్థితి గతులు వివేకులకు తెలిసియేయున్నదిగదా.

## జంతువుల స్వాభావికాహారము.

సింహము, పులి, గుంటనక్క, తోడేలు మున్నగునవి మృతపదార్థములగు మాంసాదులను భుజించునట్టివి.

మనుష్యుఁడుః ఏనుఁగు, జింక, పశువు, మున్నగునవి అమృతపదార్థములగు గడ్డి, గాదర, పండ్లు, ధ్యానములు, మొదలగువానిని భక్షింతురు.

పిల్లి, ఎలుక, మున్నగునవి చాలవరకు రెంటిని భక్షింపఁగలవు. కావున మానవులు అమృతపదార్థములనే సేవింపవలెను.

---

ఓమ్.

# జీవకారుణ్యము.

## ద్వితీయలహరి

### హితబోధ.

పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే ।
సజాతో ఏనజాతేన యాతి వంశస్సమున్నతిమ్॥

(భర్తృహరి.)

ఓ! ఆత్మబంధువులగు సోదరసోదరీమణులారా!

జననమరణ ప్రవాహరూపమగు సంసార చక్రమునం దగులుకొన్న వారిలోఁ జచ్చువారందరును మరలఁ బుట్టువారేయైనను ఎవరిపుట్టుకచే వంశమునందలి దురాచారములు తుదముట్టి సదాచారము నెలకొనునో అట్టివారు మాత్రమే పుట్టినవారగుదురు. పురుషార్థ సాధనఁ గడింపలేని చీడపురుగుల వంటివారెందరెందరో బుట్టుచుగిట్టుచునుండలేదా. జీవులు తల్లిగర్భమునుండి యుత్పన్నమైన తరువాతఁ గొంతకాలము వృద్ధిఁబొంది. కొంతకాలము యౌవనదశనుబొంది, కొంతకాలము వృద్ధాప్యదశనుబొంది తుదకు అవసానదశయందు మృత్యుముఖమునంబడి పోవుచుండలేదా, ప్రాణులలోనెల్ల నుత్తములగు మనుష్యులు యౌవన మదముచే గర్వించి, ఐహికైశ్వర్యభోగంబులనే శాశ్వతంబులుగా నెంచి చెడిపోవుచుండుట మిక్కిలి శోచనీయముకదా! యుక్తాయుక్త విచారములేక ఘోరకిరాతుల మాడ్కి మదోన్మత్తులై, గర్వాంధకారమగ్నులై, జీవహింసాది, దుష్కార్యరతులై సంచరించువారు నరక

మానుభవింపక పోరు. యముఁడను ఎరుకలవాఁడు మనుజులను పశువులను భ్రమలను పాశములంగట్టికొని పోవుచున్నాఁడు. అజ్ఞానమునశించువరకును ఆత్మారాముని సందర్శనము లభింపదు. తమ దేహమును గిల్లినంతటనే నొప్పియని యరచువారికి, బీదజంతువులకును అట్టినొప్పియే కలదను కరుణ లేకున్నదిగదా! ఇదియెంతటిగర్వము! ఏపాటిమదము! అకటా! మదోన్మత్తులెంతటి దుష్కార్యములకైన వెనుదీయరుగదా! వారిమనసు కఠినమైనది. వారిగుండె రాతిగుండె. వారికి విధినిషేధములే లేవు

ఔరా! ఎంతటిసాహసము? ఏలాటి యజ్ఞానము? ఏపాటిగర్వము అయ్యో!! బీదజంతువులనుఁ జంపితినకున్నచో వీరికుక్షి నిండదా? ఈశ్వరుఁడు మానవునకొఱకై యెన్నియో పదార్థములను నిర్మించియుండగా వానినేమాత్రము గమనింపక దుర్గంధపరిపూర్ణములగు మద్యమాంసములనే సేవింపవలెనా?

మానవులకును దానవులకును భేదమేమి? మన లను అక్షరములే కావా? అదియే మదము. మదమును ధరించినవారే దానవులు. మదమును మట్టుబెట్టినవారు మానవులు.

అనగా పరహింసాది దుష్కార్యరతులే రాక్షసులు. అహింసావ్రత పరాయణులే దేవతలు. రాక్షసులు వేరెక్కడనోలేరు. క్రూరకర్ములే రాక్షసులు.

> తేజఃక్షమాధృతిశ్శౌచ మద్రోహోనాతిమానితా।
> భవంతిసంపదందైవీ యభిజాతస్యభారత॥

(గీత-అ ౧౬ శ్లో ౩)

తేజస్సు, ఓర్పు, ధైర్యము, చిత్తశుద్ధి, పరులకు ద్రోహముచేయకుండుట, గర్వములేకయుండుట, ఈలక్షణములు ఓ అర్జునా! దేవాంశముతో జన్మమెత్తిన మనుష్యులకుఁ గలుగుచున్నవి.

దంభోదర్పోభిమానశ్చ క్రోధఃపారుష్యమేవచ ।
అజ్ఞానంచాభిజాతస్య పార్థసంపదమాసురీమ్॥

(భగవద్గీత)

ఓయీ పార్థా! డంబము, గర్వముఅభిమానము, కోపము, ఆల స్యము అన్యులయెడ కఠినముగానుండుట, (వంచించుట) అవివేకము, ఈ గుణములన్నియు అసురాంశముతో జన్మమెత్తిన వారలకుఁ గలుగుచున్నవి.

మోహాద్గృహీతాసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః॥

(గీత-అధ్యా ౧౬-౧౦)

అట్లు అసురాంశతోబుట్టినవారు మోహపరవశులై క్షుద్రవ్రతముల నుచేయుచు మద్యమాంసాదులను లెస్సగాదిని చెడుమార్గమునఁ బ్రవర్తించు చుందురని శ్రీకృష్ణభగవాను లానతిచ్చియున్నారు. కావున మాంసభోజన ము దురాచారమని విస్పష్టమైయున్నది.

మద్యపస్యకుతస్సత్యం దయామాంసాశినఃకుతః ।
కామినశ్చకుతోవిద్యా నిర్ధనస్యకుతఃక్రియా॥

మద్యపానము చేయువానికి సత్యమెక్కడిది? మాంసభోజనము చేయు వానికి దయయెక్కడిది? కామునకు విద్యయెటులవచ్చును; దరిద్రునకు కార్యమెటుల సిద్ధించును.

{ మద్యపానము చేయువానికి
జ్ఞానముండునా! }

శ్లో॥ నవేత్తిమద్యపానతః స్మరేణవిహ్వలీకృతః ।
స్వమాతరం స్వయోషితాసమానమేవమన్యతే !
వివేకబుద్ధిహీనతః కరోతిదేహినాంవధం ।
తతోవివేకిభిర్జనైః సురానిషిధ్యతేసదా॥

(మాణిక్యమాల)

తా. మద్యపానముచేత మదించిన కామపీడితుఁడు తల్లినే «భార్యయని» తెలియుచున్నాఁడు; వానివివేకమును బుద్ధియును, నష్టమై నందుచేత వాఁడు ప్రాణులను హింసించుచున్నాఁడు; కావున వివేకముగలవారు కల్లుసారాయములను త్రాగరాదు.

అనేకులు (గొప్పస్థానములుచేసినవారు సయితము) మితిమీరి తెగత్రాగి యెదురుబడిన వారిని కొట్టుటయు భార్యలనుఁగొట్టుటయు, పిల్లలను చంపుటయు మున్నగు దుష్కృత్యములు చేయుచుండుట మనమప్పుడప్పుడు (nuws) వార్తాపత్రికలలో చూచుచుంటిమి కదా !

## —(*)అమ్మవార్లు; వారిమహిమ. (*)

సర్వలోక శరణ్యుఁడైన పరమేశ్వరుని దివ్యమహిమను మరచినవారయి ఈశ్వరశక్తికంటె భిన్నమగు క్షుద్రశక్తులుకలవను నమ్మకమునకు లోబడి రానురాను దినమునకిద్దరు ముగ్గురుశక్తులను (అమ్మవార్లను) కల్పించుచున్నారు పూర్వకాలమందవి లేనందుటకే దేవతలపేళ్ళే గొప్పనిదర్శనములయి యున్నవి. వేలకొలది పేళ్ళు ధరించి పామరులను తమ వశపరచుకొనియుండు అమ్మవార్లపేర్లు కొన్నిమాత్రమీక్రింద వ్రాయఁబడుచున్నవి.

అహంకాళమ్మ, మహంకాళమ్మ చల్లాపురమ్మ, సత్యమ్మ, శాంతమ్మ జగంజ్యోతమ్మ, పోలేరమ్మ, కాలేరమ్మ, అక్కలమ్మ, కుక్కలమ్మ, వీరమ్మ మద్దూరమ్మ. చిన్నమ్మ, పెద్దమ్మ, దుర్గమ్మ, కొల్లాపురమ్మ. వల్లకాటమ్మ, గంగమ్మ, గరిశమ్మ, గంగాలమ్మ, దొంగాలమ్మ, తిప్పలమ్మ, తెప్పలమ్మ, పటాలమ్మ, మసలమ్మ, మశిణమ్మ, గొట్టాలమ్మ, బొబ్బలమ్మ, చాటలమ్మ, పోరకలమ్మ, దిగదుడుపులమ్మ, శివాపతాళమ్మ, కాళమ్మ, లగుమమ్మ, మంటలమ్మ, పోట్లమ్మ, కీళ్ళమ్మ, మురుగులమ్మ బెదలమ్మ, బెంకీమారెమ్మ, గోణమ్మ, దురదమ్మ బెళచమ్మ, ఎల్లమ్మ, చిక్కమ్మ, దొడ్డమ్మ, ఊరిమారెమ్మ అన్నమ్మ పున్నమ్మ భద్రమ్మ, నల్లమ్మ, దొడలమ్మ, వెడలమ్మ, కొళసమ్మ, బేదులమ్మ, వాంతులమ్మ, ఉబ్బలమ్మ, దగ్గులమ్మ మున్నగు అమ్మవార్లను వీరికితోడుగా వీరి

బంధువులగు, కంబదరాయఁడు, కరవీరతిమ్మఁడు, ఫిరంగిమునెప్ప. మాటూరుమీదప్ప, తూముమునీశ్వరుఁడు, కొండమునీశ్వరుఁడు మున్నగు లెక్కలేనన్ని మునీశ్వరులును, చెట్టుక్రింద గుట్టక్రింద ఏర్పడిన రాతిబొమ్మలు, కొయ్యబొమ్మలు వేలకొలఁది నిలుపఁబడియున్నవి. అవి ఏనాఁడు నిలుపఁబడినవో, యేధీరులచే నిలుపఁబడినవో పాపము వారియాజ్ఞకు లోబడి కాబోలును కదలమెదలలేక నేటికిని అట్లేయున్నవి. వానివద్ద (వకాలత్) అధికారముపుచ్చుకొని వానిపేరుతో, జీవహింసాది దుష్కార్యరతులగు జ్ఞానశూన్యులెందరెందరో మిట్టిపడుచున్నారు. ఇప్పుడిప్పుడు ప్లేగమ్మవారుఁగూడ కొన్నిగుళ్ళు కట్టించుకొని నీచజనులపయిన ఆవేశించి పామరుల కనేకభవిష్యత్తులు చెప్పుచు, ఆయుష్యము పూర్ణముగాగలిగి మందులచే స్వస్థపడిన వారికందరికిని ప్రాణదానము చేయుచున్నది.

## —(*) ఆవేశములు (*)—

ఏడేండ్లకొకతూరియయిన నోడలుతోముకొను పుణ్యమునకుఁబోనిదురాచారరతులగు స్త్రీపురుషులపయినఁదప్ప యితరులపయిన నీదేవతలావేశింపవు. ఇటీవల యుత్తములనఁబడువారిలో కొందఱు ద్రవ్యార్జనాసక్తిచే నేమి, లోకులనుభయభ్రాంతులకు లోబరుపవలెనను దురూహతో నేమి దేవతావేశము నటించుచున్నారు. త్రాగుబోతులు వ్యభిచారులునగు నీచస్త్రీలపయిన తరుచుగా నావేశములు వచ్చుచుండును. ఒకానొకచోట నేను స్వతః చూచిన ఆవేశవైభవము నిచ్చట వ్రాయుచున్నాను. నేను గ్రామాంతరము వెళ్ళిపోవుచుండగా త్రోవలోనొకమారెమ్మగుడి తటస్థించినది. కొంతదూరమునకే వినవచ్చిన యాగలభద్గ్రరఘఁ బోనుపోనుమిక్కిలి యతిశయించి పిటికి జనులు నిరభ్యంతరముగ భీతిజెందఁదగినంత భీకరముగానుండెను-

మామిడాకులు, వేపాకులు, కొబ్బరిమట్టలు మున్నగువానితోను దయ్యాము గన్నేరిపువ్వులతోను నలంకరించియుండిన చప్పరము (పందిళ్ళు)

మిక్కిలి విశాలముగానుండెను. అమ్మవారి బొమ్మనెత్తుకొని క్రియొ దీర్ఘకాయుడు నాట్యముసలుపుచుండెను కొలుపు (మేళము) తప్పెట డోలు మున్నగు శబ్దములు కర్ణకఠోరముగనుండెను. రెండు మేకపోతు లచ్చటి స్తంభములకు గట్టివేయబడి మొత్తుకొనుచుండినవి. వేయేల; అచ్చట స్త్రీ పురుష భేదమేమున్నయె స్వేచ్ఛగానుండిరన్న(జాలును ఇంతలోనొక యువి నేకికి నిలువుకండ్లు పడజొచ్చెను. కొంచెము కొంచెముగావణఃకు. ఆదలుతొదలు మాటలు, తలతిప్పటలు ఆరంభమైనవి సత్యవిద్యావిహీనులును. క్రూరచిత్తులును, పాపభీతి లేనివారునగు పామరులు కొందఱు ముందుమిగిలి ఆవేశము వచ్చినవానికి సాంబ్రాణిపొగచూపి రెండుచేతులను జోడించుకొని అమ్మా! లోకాద్యకీ నీకుపిల్లలాకండ్లు, మాకురొండేకండ్లు, కటాచ్చణమునూ శ పలుకుతల్లీ! నిజమా? సక్కంగ పలుకు!

ఆవే.—(అదురుమాటలతో) పెద్దగా ఊనురువిడచుచు: హూహూ ఊ, ఊ హుహుహుహూహుహూహూహుహూ. హుంహూంహూం హా!!!

పామరులు:—ఒకరితోనొకరు, ఇదేమి యింతకోప మేవాటికీలేదే తల్లీ!

ఏమో అభిశారమయ్యుండాల్నప్పో!

(ఇంకొకడు) ఔనోరి! అట్లేవుంది వాబుద్ధికి, ఎవరోమాన్పిచ్చుండొచ్చునబ్బా! కాని యింగొగశారదుగు.

మొదటివాఁడు:—అమ్మో, తల్లీమన్నిచ్చు.

వేరొకడు:—నలుకురా మేకపోత్తు గాడము, రే, రే,

మఱొకఘాతకుడు:—(తటాలున మేకపోతును నఱికివైచెను)

ఈసంకటమును పట్టజాలక వానోటినుండి యప్పుడేవెడలిన ఊకిరింది మాటలు అప్పటికేమనియు దెలియకున్నను నిప్పుడది లయగాఁహిని బోలినది.

కత్తులనుగేలగొని తత్తరముతోనుఱికి,
మొత్తముగజంతువుల కుత్తుకలనఱికి
చిత్తముననుబ్బివెస క్రొత్తయుత్సాహముతొ
నత్తుకొనియలికులీ రిత్తకూతలతో
బిత్తలిగనాడి పలు నృత్తములుసేయుచును
మత్తుతలకెక్కఖల మత్తగాశినులన్
బిత్తరపుమాటలతొ యెత్తి కౌఁగిటజేర్చి
యొత్తిలెడిభంకులను మొత్తుచినసుతుఁడూ,

కటికంగడినట్టు బసవపురాణముపనికిరాన ట్లాకూళిరులముంగిట నీతిబో ధలప్పటికేమియూ సాగకపోయినను దీర్ఘబోధచేసినందువయిన వారిలో ఇద్దరుముగ్గురిప్పుడు మద్యమాంసనిషేధబోధసలయిచేయునాన్నారు.

అపయిని అమ్మవారిని పలువురు పలువిధముల బ్రార్థింపగా.

ఆవేశ:—ఒరే నన్ను దూసాక్కులు ! ఈ హుహూ ఈ ఊ శేస్తారు- శేస్తారు ! పెట్టుద్నా భగమంట్లు, ఊ.

పాము:—ఒద్దుతల్లీ ! ఆదిసకతీ ! పరంజోతీ ! అంతదూరంమవమపెట్టొద్దు, పిల్లలమీద తల్లికోపమా ! తల్లిరాక్కెతే బిడ్డుబతుకుతా రా.

ఆవేశ:—నన్నెందుక్కురా, కోరిందీ !

పాము:—తల్లీ ! పూర్లోగాళ్ళు, ఆసార్లు ఏదాల్సదివివబ్రామల్లు, అంతా శేరుంటారు. ఈసమస్త్రం పలమెట్లుందితల్లీ !!

అమ్మవారుఆవేసం:—(పండ్లుపటపటకొరుకుచు.)

(తరిగపాట వలె.)

వేదాల్ గీదాల్ మాదగ్గరేపాటి ఆదీస త్తినేనే కాదే
మిరా,

ఛేదాల్ చేసేటి యీమయీకుణలా నెల్లాపదించిమింగేను
సూడండరా॥

(దీనికితోపాటు వాద్యములు మ్రోగుచుండు.)

చిత్తూరు పక్కాన శిరిగితమూనొకటి
వంగీని లేశీని వాలించరా
రంగోలుదేశాన రాగీమా నొక్కాటి
ముంగారునానకే మాడీనిరా.

పామరులు:—ఇంగా ఏమోముందో కాలగతి ఆయతల్లీ,—ఊ,
అమ్మ:—హూ!

మేలుకోటాలోన శిలపిళ్ళికంటిలో
సాలూగానీళ్ళు తేకారినిరా
ఏలూరుకోటాకు ఎంక శేశూడొచ్చి
ఎక్కి ఎక్కి ఎక్కి ఏడ్చీనిరా.

పామరులు:—ఒకరినొకరు చూచుకొని, ఆశ్చర్యముతో, బాగాయున్నప్ప
ఇంగేమి తల్లీ! హా!!

బెజవాడాదగ్గిర గుజగుజలాడుచు
మజలీలుచేసేరు రాకాసులూ
గజిబిజిసేయుచూ మమ్మూతిట్టువార్ని.
నజిబీజీశేశేరు సూడండరా.

ఉళయాళ భగవాతీమాయకాౘ ఒకాౘ
భళిభళికుణిశేణీ ధిమిధిమ్మాని
దుళిధూళీ శేసేణి సదివినవాళ్ళంతా
దొళ్ళెగరగొట్టెని సూడండరాి.
తాటీపత్రి తావాతాళ్ళ్లో ఒగమేక
యాటాడిపులిజాత్ని సంపేణీరా
తాటీమానూలోన తెంకాయలిడి శేణి
జూటాలూగాదివీ సూడండరాి.
శామండీకొండాలో శేమంతీ శెట్టొకటీ
నాముంట్లెకక్కీౘని నామాటల్లో
ఏమన్నాతప్పొస్తె ఏయొద్దూసాం శాిణి
స్వామంటాతలియొద్దూనన్నింగ్మిటా.
ఓరుగంటీ సీమాలో మామ్మారీపుట్టీని
ఓంకారామెంశొౘనీ వచ్చినీరా
మమ్మల్ని దూస్కాౘలు శేశేటివారీని
హుమ్మానీ మింగినిసూడండరాి.
జల్లీరాభదూ్రిమా జాగ్లూతట్టీని,
మల్లీకేశ్వారూడు పాడీనిరా
బల్లినోట్లోఒక్కౘ పెనుబాముపుట్టీని
కల్లంగాదీమాట కానండరోి.

నందీబసవన్నాను పందొగటీమింగీని
    యెందెందొయెది కనశికాదాదీ
మందారాగిరిమీద మామిాడిశెట్టేత
పిందేలుకాయాలు కాశీనిరా.
ముళబాగాలను మప్పముమ్మారుకూశీసీ
జగడాలూ శేశీనిజనులాకూడా
భగభగమని మండిపొయ్యేరు సూడండా
మాంసాలు తినాదు అనేవాళ్ళూ.

అని యార్భటించుచు క్రిందపడిపోయెను. పామరు లెంతయు భయభ్రాంతులై యేమేమో గొనుగుకొనుచుండ, అమ్మ శెప్పిన కారణీకాల్లో అరవా శిబుడేవడీశిపొయ్యింది, అని వేఱుకొందఱుమకొనుచుండిరి. మన దేశముచారీ రీతిగా మాఢ్య దేవతకు లోబడియున్నారు. అకటా!!

రాళ్లో, బొమ్మలో, ఏదేవతలో, ఏమైనగాని, పూజించుటవలనహాని లేదు గాని, జీవహింసాదుఃరాచారమువలన మిక్కిలి హానికలుగుచున్నది.

{ మాంసభక్షణము ఏజాతివారికైనను
విధింపఁబడినదా? }

ఉత్తమజాతియందుఁబుట్టిన వారగుటచే బ్రాహ్మణాదులు మద్యమాంసాదులనువదలి పరిశుద్ధులుగానున్నారనియు, తక్కువజాతి వారలగు శూద్రాదులు మాంసాదులను సేవించియేతీరవలెననియు, అట్లుసేవించుటయే ముఖ్యమనియు, దానిని విడిచినచో పాపము వచ్చుననియు, తక్కువజాతుల కదియే సూచనయనియు కొందఱు శూద్రులేవాదించుచున్నారు. అహా! ఇదెట్టివింత! జాతియనగనేమో వారికింకను దెలియలేదుకాబోలును, జాతి

రువే. మతము వేరు. జాతి ఈశ్వరసృష్టిలోనిది. దానికి చలనములేదు. ప్రకృతికి సంబంధించిన మార్పునులేదు. అనగా, మనుష్యజాతి, మృగజాతి వృక్షజాతులనునవి. అందు మృగము మనుష్యునివలెను మనుజుఁడు మృగమువలెను మార్పు జెందలేరు. మతమట్లుకాదు. అది జీవసృష్టిలోనిది. దానికి మార్పుకలదు. అది వేషభాషలకు లోబడినది. మేదరవాఁడగు శఠకోపుఁడు వైష్ణవమతము నవలంబించి వైష్ణవోత్తముఁడయ్యెను. తురకయగు కబీరుసయితము వైష్ణవుఁడయ్యెను. ఇటుల శైవుఁడు వైష్ణవుఁడుగను వైష్ణవుఁడు శైవుఁడుగను మతములోమార్పు చెందవచ్చునేగాని జాతిలోమార్పు జెందుటకెవ్వరికిని సాధ్యపడదు. ‡శ్రీశంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్యప్రభృతులు మదములనుహరించి మతములనుస్థాపించి, మతోద్ధారకులని పేరొందిరేకాని, జాత్యుద్ధారకులని పేరొందలేదు. కావున మృగములు, పక్షులు మున్నగుజాతులవలె, మనుజులుమానవజాతికి చేరినవారు. మానవజాతికి ఆహారముగా భగవంతుఁడుశాకధాన్య, ఫలాదులనునిర్మించియుండెను. కాని మాంసాహారము మానవులకు విధించలేదు మానవజాతికే విధించఁబడకపోగా నిఁక కొందరు తినవచ్చుననియు, కొందరు తినరాదనియు, చెప్పుట మిక్కిలివింతగానున్నది

జిహ్వాచాపల్యబద్ధులగు దురాత్ములచే వాడుకకు దేబడిన దురాచారములలో నిది యొకటి.

## వర్ణాశ్రమాచారవిధి.

"వర్ణానాం బ్రాహ్మణోగురు," వను విధిప్రకారము మానవులలో నుత్తములగు బ్రహ్మతేజోవిరాజితులే మార్గముననుసరించి ప్రవర్తించెదరో తక్కినవారును నట్లే ప్రవర్తించవలెను. లేనిచో గుర్వాజ్ఞాతిక్రమణ దోష

‡ నందిరాజ లక్ష్మీనారాయణ దీక్షితులు వైష్ణవమతమును నిరాకరించి చక్రాంకితము చేసికొనక శైవమతమునందే ప్రవేశించిరి. అలసాని పెద్దనాదులు శైవమునుద్యజించి వైష్ణవమతమునే యవలంబించిరి.

బద్ధులగుదురు. బ్రహ్మతేజో విరాజితుండగు శ్రీనారదమహర్షి ధర్మరాజునకు వర్ణాశ్రమాచార ధర్మములనెఱింగింపుచు, సత్య, శాంత, సౌజన్యాది గుణములుగలవారగ్రవర్ణులనియు, ధైర్యస్థైర్య వివేకవంతులు క్షత్రివర్ణులనియు, కృషిగోరక్షణ సత్యవాక్యపరిపాలన వాణిజ్యవృత్తులుగలవారు వైశ్యవర్ణులనియు, నిర్మాత్సర్యముతో స్వామిసేవఁజేయువారు శూద్రులనియు ఛలకపట, పక్షపాత, జీవహింసాది దురాచారపరులు అంత్యజులనియు వక్కాణించి సంకరవర్ణస్థులయిన రజక, చర్మకారక, నట, బురుడక, కైవర్తక మ్లేచ్ఛ, భిల్లులాదిగాగలనంత్యజులకును, చండాల, పుల్కస, మాతంగులకును, కులాగతంబులయిన వృత్తులలో (మిక్కిలి నీచములయిన) చౌర్యజీవహింసాదులను వర్జించి సంచరింపవలయునని ఆనతిచ్చియున్నారు. వివేకులారా! జీవహింసాది దురాచారములు అంత్యజులగు మాల మాదిగలకుఁగూడ కులాగతములయిన వృత్తులలోనెల్ల మిక్కిలినింద్యములయినవనియు, మాలమాదిగలు కూడ వానిని విడనాడవలెననియు, నారదులవారు స్పష్టముగా విధించియున్నారు.

అహింసాసత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః।
ఏతత్సామాజికంధర్మం చాతుర్వర్ణ్యేబ్రవీన్మనుః॥

(మనుస్మృతి-౧౦-౬౩).

అహింస, సత్యము, దొంగిలింపకుండుట, పవిత్రత, ఇంద్రియనిగ్రహము, అనునవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది నాలుగువర్ణములవారికిని ముఖ్యము. చూచితిరా! మద్యమాంససేవనవిధి మానవజాతికే లేనప్పుడు కొందఱు తినవచ్చుననియు, కొందఱు తినరాదనియు చెప్పుట మిక్కిలి యవివేకము. ఆ దురాచారమునుండి యెల్లరును దూరముగా తొలంగి సుఖపడవలెను.

## (*) మద్యమాంససేవనలు మొదటలేనిది మధ్యకాలమందెట్లుకలిగెను. (*)

ఏమతమునందును మొదటనీదురాచారము లేదనియు, మధ్యకాలమునందుత్పన్నమయ్యెననియు చెప్పెదరే ? మొదటలేనిది మధ్యమందెట్లువచ్చెనని కొందఱడుగుదురు. మొదటలేని దురాచారములెన్నిగా మధ్యకాలమునందబ్బుచున్నవి. ఆర్యులగు వైదికపురుషుల కాలమునందులేని దురాచారములెన్నియో, పౌరాణికులకాలమునం బుట్టియున్నవి. వ్యభిచారము, దొంగతనము మొదలగుదురాచారములెట్లు మనుజులయందలవాటుపడెనో, ఇదియును నట్లేకలిగినది.

## మృగాదులు మాంసభక్షణము చేయుచుండఁగా మనుజులేల చేయరాదు ?

జీవహింస సలుపరాదనియు, మద్యమాంసములను సేవింపరాదనియు వచించెదరే. సింహ, శరభ, శార్దూల, భల్లూకాదులను దినమును లెక్కలేనన్ని జంతువులనుజంపి దినుచుండలేదా ? కోఁతులు మొదలగునవి కల్లుత్రాగుచుండలేదా ? ఇఁక మనుష్యులుమాత్రమట్లేలచేయరాదని కొందఱడుగుదురు, (అడుగుదురనుటేల ? మమ్ము నెందరో యడిగిరి.) మృగాదులకు వివేకములేదు. అవి ఘాతుకజంతువులు. కావున జీవహింస సలుపుచున్నవి సింహ, శరభ, శార్దూలాదులు, ఘాతుకజంతువులు, ఏనుగు, జింక, గుఱ్ఱము ఆవు మొదలగునవి సాధుజంతువులు. ఇవి జీవహింసచేయవు. మాంసమును ముట్టవు. ఘాతుకజంతువుల నెప్పుడును, ఖైదీలవలె బోనులలో వైచి బంధింతురు. సాధుమృగములను సామాన్యముగా పగ్గములతో గట్టుదురు. దుష్టమృగములనుఁ గొట్టుటకై ఆయుధపాణులై దిరుగుచుందురు. సాధుమృగ

ములనుబట్టి పెంచుకొందురు. మాంసమునుఁదినెడి క్రూరజంతువులకు రాక్షసులకువలె కోరపండ్లుండును. సాధుమృగములకవి యుండవు. కోరపండ్లు లేని సాధుమృగములవద్ద మాంసమునువైచినను నవిముట్టుకొనవు. ఇటుల మృగములయందే యెంతో కట్టుదిట్టము లున్నవనగా, వివేకముగల మానవజాతి మాత్రి మస్వాభావికమగు మాంసభోజనమునుఁ గోరవచ్చునా?

> తరవోపిజీవంతి జీవంతిమృగపక్షిణః।
>
> సజీవంతిమనోయస్య మననేనోపజీవతి॥
>
> (మహోపనిషత్తు).

చెట్లు, మృగములు, పక్షులు, బ్రతికియుండునట్లు బ్రతికియుండువాఁడు మనుష్యుఁడుఁ గాజాలఁడు. ఎవనియొక్క మనస్సు స్వరూపానుసంధానము (జ్ఞానవిచారము) చేయుచుండునో వాఁడే మనుష్యుఁడు. కావున జీవహింసాది దుష్కార్యములకులోఁబడి చరించుట ఘాతుకమృగముల స్వభావము. వానివలెనే చరించునెడల మనుష్యులు, ద్విపాదమృగము లనఁబడవలసివచ్చును.

> ఆ॥ మృగము మృగములనుచు మృగములనననేల
> మృగముకన్న చెడుగుమూర్ఖుఁడౌను
> మృగముకన్న గుణము మూర్ఖునిలోలేదు
> విశ్వదాభిరామ వినరవేమ.

అను పరమవిజ్ఞాన విశారదులగు వేమనగారి వాక్యము చొప్పున మృగములకంటె దుర్వృత్తులలోఁబడి తపించుచుండు మూర్ఖులే మిక్కిలి తక్కువయని గ్రహింపవచ్చును.

ఓమ్.

# జీవకారుణ్యము.

## తృతీయలహరి.

### జీవహింస మిక్కిలి పాపకరము.

అహింసాపరమోధర్మః అహింసాపరమంతపః
అహింసాపరమందానం. ఇత్యూచుర్మునయస్తథా.

(విజ్ఞానదర్పణము).

ఏప్రాణినిఁగాని హింసింపకుండుటయే పరమధర్మము. అదియే గొప్ప తపస్సు; అదియే పరమదానము, అని మునికులోత్తములు వక్కాణించియు న్నారు. ప్రాణులనుఁ జంపుటకంటె పాపము వేరొండుఁలేదు. ఘోరనరక ప్రాప్తికదియే ముఖ్యహేతువు.

జనులారా! జాగ్రిత, జాగ్రిత, జంతువులను హింస చేయకుఁడు!!

ఉ॥ మ్రానను రాతనుంగలదె, మాంసము ప్రాణుల మేనగాక యు
ప్రానులనొంచునప్పుడదె, మేనులుసోకిన మాత్రిమెట్లగుర్
దానిదలంపగావలదె, తానదిమానిన హింసలన్నియున్
మానవెయంచు నుత్తముఁడు మాంసముమానుదయార్ద్రి
చిత్తుఁడై.

(శ్రీమహాభారతము అనుశాసనిక పర్వము).

మాంసము మ్రానులయందును, ఱాళ్లయందును కలుగదు. అది కేవలము జంతువులను హింసించుటచేతనే కలుగుచున్నది. మీశరీరములకు నతికినచో మీ కెంతనొప్పిగానుండునో, జంతువులనుఁ జంపినచో వానికిని నట్లే బాధకలుగునను తలంపుతో జనులారా! జీవహింస మానుకొనుడీ, యనిభారతము చాటుచున్నది.

అకటా! కఱకుకత్తుల జళుపుఁ జూచినప్పుడా బీదజంతువులెంత పరితపించునో! యెంతశోకించునో! ఎంత కుగ్గి తగ్గి వ్యథఁజెందునో, ఏపాటి కంపమొందునో! ఇసుమంతయు గమనింపక కౄరరాక్షసులవలె సంహరించుచుందురే; పరమేశ్వరా!! నీకారుణ్యమెప్పుడు కలుగునోగదా! నీవేమి చేయగలవు? నీదివ్యశాసనమొక్కటే అది యమోఘమైనది.

యథాచారీయథాకారీ తథాభవతి
సాధుకారీ సాధుర్భవతి, పాపకారీ
పాపోభవతి । పుణ్యఃపుణ్యేన
కర్మణాభవతి పాపఃపాపేన.

ఎవఁడెవడెట్లుచేయునో అట్లే కర్మమును తలకుఁగట్టుకొనును. మంచికర్మమును చేయువాఁడు మంచిపదవిని పొందును. చెడుకర్మమును చేయువాఁడు చెడుగతి నొందఁగలఁడు. పుణ్యకర్మముచే పుణ్యాత్ముఁడగుచున్నాఁడు. పాపకర్మముచే పాపాత్ముఁడగుచున్నాఁడు.

ఇదియే నీమహాశాసనము.

## జన్మాంతర విచారము.

ఇట్లన్నవెంటనే వైతండికులుకొందఱు, భుజాస్ఫాలనము సేయుచు, ఔనౌను. అవి పూర్వమున మమ్ముల నతికినవి. మేమిప్పుడు వానిని నఱుకుచున్నాము. కాయఁతీర్చుకొనెదము, అందున దోషమేమి, అవి పూర్వజన్మ

మునఁజేసిన పాపమిప్పుడనుభవించుచున్నవని లవలేశమైన కరుణవేక వాదిం
చువారనేకులుగలరు.

మిత్రులారా! కర్మానుభవమునకే ప్రారబ్ధమని పేరు. అది ఇచ్ఛా
ప్రారబ్ధము అనిచ్ఛాప్రారబ్ధము పరేచ్ఛాప్రారబ్ధములని త్రివిధములుగను
న్నది. జీవులు స్వకార్యార్థమై చేయుపనులవలనఁగలిగెడి సుఖదుఃఖములు
ఇచ్ఛాప్రారబ్ధమనఁబడును. పరులకార్యార్థమై చేయు పనులవలనఁగలిగెడి
సుఖదుఃఖములు పరేచ్ఛాప్రారబ్ధమనఁబడును. ఇచ్ఛయేలేక దైవికముగా
ప్రాప్తించెడి కష్టసుఖములు అనిచ్ఛాప్రారబ్ధమనఁబడును. ఇదిప్రారబ్ధవిచా
రము. ఇదిసంచితమునుండి ప్రకృతమనుభవించుటకేర్పరుపబడినది. ఈయనుభవ
కాలమునందే నవీనకర్మ చేయుటకలదు. దానికే ఆగామియని పేరు. అదిరా
బోవు జన్మమునం దనుభవించుటకై యెదురుచూచుచుండునది. ఎట్లనగా,
ఒకానొకరైతునకు గతసంవత్సరమునందారు (పుట్లు) కలములధాన్యము పండె
ననుకొందము. దానికి సంచితమని పేరు. అందుండి ప్రకృతసంవత్సరపు జీవ
నమునకై మూడుపుట్లధాన్యమును కణఁజను భద్రపరచెను. దానికిప్రారబ్ధ
మని పేరు. సంవత్సరముపొడుగునను కణఁజములోని ధాన్యమును వండి భుజిం
చుచుండును. దానికి ప్రారబ్ధానుభవమని పేరు. అట్లనుభవించుచు నూరకుం
డడు. మరుచటి సంవత్సరపు జీవనమునకై నేలదున్ని పంటఁబెట్టును. దానికే
ఆగామి, యని పేరు. తత్సంబంధములగు పుణ్యపాప ఫలములను రాబోవుజన్మ
మందనుభవించియే తీరవలెను. ఒరులచేహింసింపఁబడుట ప్రారబ్ధమనఁబడును
ఒరులను హింసించుట, ఆగామి; జాతీయవ్యవస్థనుఁబట్టి యదిమృగములకును
మానవులకును మిక్కిలి వ్యత్యస్తముగనున్నది. పశ్వాదులకదిప్రారబ్ధమైన
నను కాకున్నను మనుజునకది, ఆగామి, యగును. వివేకియగుమనుజుఁడుదానికిఁ
బాల్పడరాదు, దీర్ఘాలోచనబుద్ధిలేనివారికీ మర్మముబోధపడుట మిక్కిలి
దుర్లభము. దీనిసంపూర్ణ వివరమెఱుఁగఁగోరువారు మాగ్రంథమాలకు సంబం
ధించిన, ధర్మ సూత్రప్రకాశికను జదువవలెను.

## మాంసము దేహపుష్టిని గలిగించునా.

కొందఱపారవితండవాదాపాండిత్యముగలవారు, మాంసము తినుటచే దేహపుష్టికలుగునని వాదింతురు. అందుకు దృష్టాంతముగా ! "ఘృతేన వర్ధతేబుద్ధిః, క్షీరేణాయుర్వివర్ధనం, శాకేనవర్ధతేవ్యాధిర్మాంసంమాంసేన వర్ధతే."

నేతిచే బుద్ధి వర్ధిల్లును, పాలచే ఆయుర్వృద్ధియగును, కూరగాయలచే వ్యాధియధికరించును, మాంసముచే మాంసమువృద్ధియగునని తాత్పర్యము. ఇది సర్వాబద్ధము. ప్రక్షిప్తశ్లోకము. అనుదినమును శేర్లకొలది నేయి తినువారనేకులు శుద్ధమందులగుచున్నారు. సదాక్షీరపానము సేయువారనేకులు ముప్పదిదాటకమునుపే మృత్యుముఖమునఁ బడుచున్నారు. అరణ్యమున కాయగూరలనుఁదినువారనేకులు దృఢకాయులై దీర్ఘజీవులైయున్నారు. మాంసము దినువారనేకులు (ఊరూరియందును) బలహీనులై కృశాంగులైయున్నారు, ఇట్టికుకల్పితశ్లోకములను నమ్మికొని యన్యాయముగా జీవహత్యచేయుచున్నారుగదా, పరమేశ్వరా! పాపముశమించుఁగాక.

"శాకేనవర్ధతేవ్యాధిః" యనఁగా శాకములచే వ్యాధివృద్ధిఁజెందదను తాత్పర్యము చాలసమంజసమైనదని జీవదయాపరులు వక్కాణింతురు.

## కోడి - రామమూర్తిగారు.

మోటారు బండ్లను సయితమవలీలగా నిలుపుచు, ఏనుఁగును సయితము పైకెత్తుచు, ఇనుప సంకెళ్ళను లెక్కగొనక ద్రుంచుచు, బలమైన బండరాళ్ళను రొమ్ముపైబెట్టి సమ్మెటలతో గొట్టించుకొనుచు మరివచింపనలవికాని యనేకాద్భుతచేతలచే నద్వితీయ పరాక్రమముజూపుచు లోకులచేనభినవభీమసేనుఁడను గొప్పబిరుదులనందిన జగజెట్టి శ్రీయుత, రామమూర్తినాయుడుగారు శుద్ధశాకాహారి. అతనికిలేని బలము మాంసాహారులగు తక్కిన వారికేమిగలదు. నాలుక చపలమూమాన్పలేక వాదించెడి మూర్ఖవాదము లెన్ని

యోగలవు. వానిచే ప్రయోజనమేమి, జీవహింసచేయువా రెట్టివారైనను మిక్కిలి పాపాత్ములేయగుదురని శ్రీ పెద్దదానులు వచించియున్నారు.

గీ॥ పాపవర్తనుండు బ్రాహ్మణుడయ్యును
నిజముశూద్రికంటె నీచతముఁడు
సత్యశౌచధర్మశాలి శూద్రుండయ్యు
నతఁడుసద్ద్విజుండె యనిరిమునులు.

(మహాభారత ఆరణ్యపర్వము.)

## అహింసనుగురించిన పశ్చిమదేశీయుల యభిప్రాయములు.

జంతువులను జంపుటకంటె వానిని బెంచి ప్రేమించుచుండు టెంత ఆత్మానందదాయకము.

ఒకరు నన్నుకోసి మాంసము గానమ్ముటకు నేనెట్లొప్పుకొననో ఆదే విధముగ జంతువులనుగోసి తినుటకయి అంగీకరించను. (హావెల్సు)

ఇతరులుపడు కష్టములు తాముస్వయముగ ననుభవించినప్పుడే నిజమయిన కనికరము కలుగును. అనుభవములేనికనికరపుపలుకులు పైపైమాటలే.

మనుజుఁడు రెండువిధములుగ విద్యనభ్యసించును. మొదటిది తాని తరులవద్దనుండి నేర్చుకొనినది. రెండవది తాను స్వానుభవముమీఁద నెఱుంగునది. (గిబ్బన్)

యుద్ధము యుద్ధమని అఱచువారిని సైన్యమునకు ముందుభాగమందు బోరాడుటకయి మొట్టమొదటి పటాలముతోఁ బంపునట్లు శాసించినయెడల నీప్రపంచమందిక యుద్ధములుజరుగవు. (హెన్ బెబెల్.)

నీవు నోరులేని జంతువులను బ్రేమించనిది నోడున్న జంతువులను బ్రేమించలేవు.

## మాంసాహార శాకాహారములందుగల బలాబలములను దెలిపెడిపట్టిక.

## (Exits. The Toiler and his food).

| ఆహారవివరము. | పదార్థవివరము. | Water. నీరు. | Protien | Fat క్రొవ్వు. | Starch Matter of Sugar చక్కెర. | Mineral Matter లోహసంబంధ వస్తువు. | Total Nutriment పెరశ్రీ ఆహారము. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| ధాన్యములు. | గోధుమలు * | 11-7 | 11-4 | 1-3 | 71-0 | 3-0 | 86-7 |
| | యవలు | 14-6 | 6 7 | 1-3 | 75-5 | 1-1 | 84-6 |
| | బియ్యము | 12-4 | 7-8 | 0-4 | 79-0 | 0-4 | 87-6 |
| | జొన్నలు | 14-2 | 9-3 | 5-0 | 66-5 | 2-0 | 82-8 |
| కూరగాయలు. | ఉరలగడ్డలు | 75-0 | 2-3 | 0-2 | 21-0 | 1-0 | 24-4 |
| పండ్లు | నేలుపండ్లు | 84-8 | 0-4 | 0-5 | 12-0 | 0-5 | 13-4 |
| | ద్రాక్షపండ్లు | 78-2 | 1-3 | 1-7 | 14-7 | 0-5 | 18-2 |
| కాయలు. | టెంకాయ | 46-6 | 5-5 | 36-0 | 8-1 | 1-0 | 50-5 |
| | బాదామి | 6-2 | 23-5 | 53-0 | 7-8 | 3-0 | 87-3 |

* గోధుమలకు తరువాత రాగులు, మిక్కిలి బలిష్ఠమైనవని కొందరు వైద్యశాస్త్రవేత్తలు వచించెదరు.
అరటిపండ్లు గోధుమలకంటె 130 ఇంతలు పుష్టికరమైనవి.

మాంసాహార శాకాహారములందుగల బలాబలములను దెలిపెడిపట్టిక.

(Exits. The Toiler and his food)

| ఆహారవివరము. | పదార్థవివరము. | Water. నీరు. | Protien | Fat కొవ్వు | Starch Matter or Sugar చక్కెర. | Mineral Matter లోహసంబంధ వస్తువు. | Total Nutriment వెరశి ఆహారము. |
|---|---|---|---|---|---|---|---|
| I | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| మాంసము. | గోమాంసము | 72-0 | 19-3 | 3-6 | ... | 5-1 | 28-0 |
| ,, | దూడమాంసము | 71-0 | 17-0 | 11-0 | ... | 1-0 | 29-0 |
| ,, | మేకమాంసము | 65-2 | 14-5 | 19-5 | ... | 0-8 | 34-8 |
| ,, | పందిమాంసము | 39-0 | 9-8 | 48-9 | ... | 2-3 | 61-0 |
| ,, | కోడిమాంసము | 67-4 | 24-26 | 6-68 | ... | 1-37 | 32-31 |
| ,, | జింకమాంసము | 75-7 | 19-7 | 1-9 | ... | 1-1 | 22-7 |
| ,, | మత్స్యములు | 86-1 | 11-9 | 0-2 | ... | 1-2 | 13-3 |
| గుడ్లు. | గుడ్లు | 64-0 | 14-0 | 10-5 | ... | 1-5 | 25-0 |
| పాలు. | ఆవుపాలు | 86-0 | 4-1 | 3-9 | 5-2 | 0.8 | 14-0 |
| | వెన్న | 12-6 | ... | 86-4 | ... | 0-8 | 87-2 |

## మాంస—శాకముల, వెలల, దెలుపుపట్టి (సీమలో)

| తూకము. | | వస్తువు. | ఆహారపు సత్తువ, (గ్రెయిన్లు) | వెల | | |
|---|---|---|---|---|---|---|
| | | | | షిలింగ్ | పెన్సు | |
| ½ | పౌండు | గోధుమరవపదార్థము | 3112 | 0 | 1½ | |
| ½ | ,, | పాలమీగడ | 996 | 0 | 1½ | |
| 2 | ,, | ఉరలగడ్డలు | 3360 | 0 | 1¼ | |
| శాకాహారమునకు, | | మొత్తము. | 7468 | 0 | 4¼ | నెలవగును. |
| 2 పా 2 ఔన్సులు | | గోమాంసము | 4108 | 1 | 7⅛ | |
| 2 పా !! | | ఉరలగడ్డలు | 3360 | 0 | 1¼ | |
| మాంసారమునకు | | మొత్తము | 7486 | 1 | 8⅜ | నెలవగును. |

ఒక్కే సత్తువగల శాకాహారముయొక్క వెలకంటె ఆదేసత్తువగల మాంసాహారమునకు 5 పాళ్ళు వెల నధికము. మన ఇండియాలో శాకాహారముమరింత సరసముగా దొరుకగలదు.

## మాంసాహారనిషేధక లోకానుభవ సంగ్రహము.

మాంసాహారము మనుష్యులకు బలముకలుగజేయునని కొందరికి నమ్మకము కలదు. కాని యీమధ్య అనేక పరిశోధనములు చేయబడి శాకాహారమే మాంసాహారముకన్న ననేకరెట్లు బలమనియు, బుద్ధిబలము గూడ నధికముగా శాకాహారమే గలిగించునని యు తెలిసికొనబడినది. దీనికి నిదర్శనముగా యూరపు ఆసియాఖండములలోని ఉత్తరభాగములందును, లాఫ్లాండర్సు, ల్యుట్రిటాన్ సామైడిస్, ఆస్ట్రియాసెన్ టాంగూసెన్, టెరాడిఫ్యుగో అమెరికాదేశములందలి ప్రజలు నురియెస్కిమోలు పూర్తిగా మాంసాహారులైయున్నను, ప్రపంచమంతటిలోను బలహీనులును, పిరికివారును నైయున్నారు. శాకాహారముల మూలమున దేహము సత్వసంపన్నమగుటయే గాక మేధకూడ వృద్ధిబొందునని ప్రయోగముల మూలమున తెలియవచ్చుచున్నది. ఏదేశము వారైనను శాకాహారులు బుద్ధి దేహబలములుగలిగి వర్తిలుచున్నారు. ప్రపంచమంతలోను బలవంతులు, ధైర్యవంతులుని పేరుపొందిన గ్రీకులు, రోమనులు పూర్తిగా శాకాహారులు, ప్రస్తుత కాలమున ప్రఖ్యాతిజెందిన యూరోపుఖండములలోని దేశములవారు చాలమంది రొట్టెలు, పండ్లు, మొదలగువాని తినునట్టివారైయున్నారు. పూర్తిగా శాకాహారులగు, ఆయిర్లాండు, స్కాట్లాండు ప్రజలు ఇంగ్లీషువారికన్న తక్కువబలవంతులు గారను సంగతి యందఱు నెఱింగినదియే. దేహసత్వమునందు ఘనతగాంచిన నీగ్రోలు శాకభక్షణులేగాని మాంసభక్షణులుగారు. దక్షిణసముద్రపు దీవుల నివాసులును నట్టివారే. వీరితో యుద్ధముచేయుటకు ఎక్కువ బలవంతులును ధైర్యవంతులును నగు ఇంగ్లీషునావికులే ధైర్యములేక యుండిరట. (ఆంధ్రకేసరి)

10-1-1912.

## మాంసభక్షణము చేయనగునా!

ఈవిషయమై రాబర్టుబేర్. యమ్. డి. అనువారు ఇట్లువ్రాయుచున్నారు. మనుష్యుడు జంతువులను తనకొరకుచంపి, దానిమాంసము తినవల

సిన అవసరములేదు. అట్లు మాంసముతినుటవలన తనశరీరమును రుగ్మతపాలు చేసికొనుటతప్ప ఇంచుకంతయు లాభములేదు. నిజముగా, అంతమాత్రముగా, నోరులేనిజంతువులనుచంపి, ఆమాంసము తినుటవలన, తాను ఏవిధమయినలాభముపొందుటలేదు సరేసరి, తాను మెల్ల మెల్లగా తనగొంతునకు ఒక ఉరిత్రాడు వేసుకొను చున్నాడు అని చెప్పవచ్చును.

మాంసము తినుజంతువులలో! అన్నకోశము మొదలుగాగలజీర్ణము చేయు గొట్టము (Alimentary Canal) ఆయాజంతువు పొడవునకు మూడురెట్లుకలదు. ఇకశాకములను భక్షించు మృగములలో, జీర్ణపుగొట్టము జంతువు పొడవునకు పండ్రెండు రెట్లుకలదు. మనుష్యుని జీర్ణపు గొట్టముకూడ మనుష్యుని ఎత్తునకు పండ్రెండు రెట్లుకలదు. ఇట్లు భగవంతుడు శాకములను భక్షించువారికి పెద్దగొట్టమును, మాంసభక్షకులకుచిన్నగొట్టమును ఏలనియమించవలెనని విచారు అడుగ వచ్చును. మాంసాదులు త్వరలోకుళ్ళిచెడిపోవ నారంభించును. శాకములు అంత త్వరగా చెడిపోవు. కాన మాంసాదులు త్వరగా శరీరము విడిచిపోవలెనను ఉద్దేశముతో, మాంసభక్షణము చేయుజంతువులకు, జీర్ణపుగొట్టము అంతతక్కువ పొడవుగలదిగానున్నది. దీనిని బట్టిచూడ, మనుష్యునికి మాంసము ఎంత మాత్రము తగదని స్పష్టముగా చెప్పదగు. ఎంతమాత్రము తగక పోవుటయే గాక, మనుష్యుని బాధించు పెద్దరోగములన్నింటికి మాంసభక్షణమే కారణమని చెప్పవచ్చును

మాంసము తినువారు, శాకములుతిను వారికంటె దినమునకు మూడు రెట్లుమూత్రమును విడుచుచున్నారు. అందుచేత, మాంసము తినువారిలో మూత్రమును తయారుచేయు అవయవములు (Kidneys) మూడురెట్లు ఎక్కువగాను అనవసరముగాను పనిచేయుచున్నవి. ఈ ఎక్కువపనిచేతనే, మూత్రసంబంధమైన యవయవములు అట్టివారిలో తరుచుచెడిపోవుచు, కీళ్లు పడిపోవుట, ఒడలులావెక్కుట, మూత్రపు తిత్తిలో రాళ్ళు పెరుగుట, మొదలగు అపాయకరములైన వ్యాధులను కలుగచేయుచున్నవి. మాంసభక్షకు

లమలము, శాకభక్షకుల మలముకంటె రెండెరెట్లు విషమయమైయున్నది, మాంసభక్షకుని కంటె శాకభక్షకుడు ఎక్కువదార్ఢ్యముగాను, శ్రమను ఎక్కువ ఓర్చుకొను వాడుగ నున్నాడు. ఇదియునుగాక, శాకభక్షకుని కంటె మాంసభక్షకుడు ఎక్కువ తిండిపోతును సారాయందు ఎక్కువ ఇచ్ఛగలవాడుగాను ఎక్కువకోపిష్టిగానున్నాడు.

కొంతమంది మాంసము శాకములకంటె ఎక్కువ బలమునుగలుగ చేయుననువట్టియభిప్రాయమును కలిగియున్నారు. అట్టివారు. ఈక్రింది సంగతులను గ్రహింతురుగాక, ఒక పౌండుగొడ్డుమాంసము (Beef) లో నున్న యాహారపదార్థములకంటె ఒక పౌండు పొట్టుతీయనిగోధుమ రొట్టెలో (Whole-meal wheat-brad) రెండురెట్లు, ఒక పౌండు బటాణీలలో మూడురెట్లు, ఒకపౌండు బాదంపప్పులో ఐదురెట్లు, ఆహార పదార్థములుగలవు. ఇట్టిసందర్భములో నోరులేనట్టియు మనకు అమృతధారలవంటి పాలు ఇచ్చునట్టియు, ఆవులను ఏల చంపవలెనో యూహింప వీలులేకున్నది. ఇది యంతయు కలికల్మషముఁగాని వేరొకటిగా కనుపించదు.

మనుష్యుని పండ్లు (Teeth) కూడ శాకముల భక్షించు మృగముల అనగా ఆవు మొదలగు జంతువుల పండ్లవలెనున్నవి. కాని మాంసమునుభక్షించు సింహము, పులిమొదలగు జంతువులకున్నట్లు కోరలతో కూడియుండలేదు. ఈ కారణములన్నియుబట్టిచూడ భగవంతుడు, మనుష్యుని, శాకభక్షకునిగా నియమించెనని స్పష్టపడకమానదు.

(సువర్ణలేఖ-11-3-1913)

—(*) గోమహిమ. (*)—

ఆ॥ శ్రుతులునౌపనిషధసూక్తులుగోస్వరూ
పంబులని సరోజభవుఁడుసెప్పె
ధర్మపరతపరమతపము మహాధ్వర
మనగబరగు గోసమార్చనంబు.

(మహాభారతము-అనుశాసనిక)



కం॥ ధేనువులు బ్రదికెనేనిన్
మానదు ఘనమైన పాఁడి; మందలుగలుగన్
మానుగనుఁ బాఁడిగలిగిన [illegible]
మానవులును సుఖులు దనిసి మనుదురు పుత్రా.

(భాగవతము-దశమస్కంధము)

మన దేశమునకు గోవులు దైవప్రాయములు. భారతాదులయందిట్లు చెప్పబడినవి.

## —(*) గోవులు (ప్రస్తుతస్థితి.) (*)—

### ఆధునికాభిమతము.

భరతఖండమున చతుష్పాద జంతువులన్నిటిలో గోవునం దధికభక్తి జనులకు కలుగుటకును గోవు పవిత్రమని ప్రజలు తలంచి గోమాంసభక్షణము

# తృతీయ లహరి.

పాపమని విసర్జించుటకునుగల కారణమేమను విషయము ఇంగ్లాండు దేశ
మున (Cosmos Society) సర్వదేశజన సభవారియెదుట కొన్నివారము
లక్రిందట కె. యస్. జస్సావాలా గారొక దీర్ఘోపన్యాస మొసంగిరి. తరస్ట
ను గారు సభాధిపత్యమును వహించిరి. బహుజన సమావేశము జరిగినదిర
జస్సావాలాగారి యుపన్యాససారాంశ మిట్లున్నది. హిందూదేశమున భార
తీయుల యాచారము లనేకములు విదేశీయులకు మూఢాచారములవలె భా
సబడును గాని ఇటీవల గొందరు పాశ్చాత్య విద్వాంసులట్టి మూఢాచారముల
నుకొనునట్టి వెన్నియో చక్కని కారణములవల్ల జనోపయోగముకొరకే బుద్ధి
మంతులవలన నేర్పరుపబడినవని నిర్ధారణ చేసియున్నారు. వానిలో జేరినది గో
భక్తియొకటి. తక్కిన జంతువులకన్న నావునకుగల విశేషమేమని మొదట
నిరసనబుద్ధిగలిగినను కొంచెమోపికతో స్థితిగతులను ఉపయోగములను లెస్స
గావిమర్శించినచో నావయాధిక్యత యెట్టిదియో విశదము కాకపోదు. హిందూ
దేశము వ్యవసాయజీవనదేశము 100 మందిలో 85 గురు వ్యవసాయదారులు
వస్తునిర్మాణకర్మ విద్యలాదేశమున మిక్కిలి తక్కువ దేశమధిక విస్తీర్ణము
కలది. యూరపుఖండములో రష్యా స్విట్జర్లండులుగాక మిగిలిన దేశము
లన్నియు గలిసిన నెంతవిస్తీర్ణముగునో హిందూదేశమొక్కటియే యంతవిస్తీ
ర్ణముగలిగి యున్నది. వేరువేరు ప్రదేశములలో భూసారము వేరువేరు విధ
ములుగ నున్నది.

శీతోష్ణస్థితి భేదముగనుండును. ఖనిజాదు లపరిమితములు, సౌకర్యము
లు విశేషములు గాని, ఇట్టివెన్నియున్నను, ప్రజల జీవనమునకు ముఖ్యాధా
రమైనది గోవొక్కటియే. గోవృషభములే హిందూదేశాభివృద్ధికి ముఖ్యకా
రణములు. వ్యవసాయపు పనులన్నియును ఎడవలననె జరుగుచున్నవి. ఎడులే
కున్న వ్యవసాయదారు లేపనియును చేయజాలరు. పాశ్చాత్యదేశములలో
గుఱ్ఱములెట్లో హిందూదేశములో ఎడంతకంటె నధికమనుట సహజోక్తి. గు
ఱ్ఱములు ఆస్ట్రేలియా అరేబియా దేశములనుండి దిగుమతియగును. విదేశము

లనుండి వచ్చినవియన్నియు ప్రియముగా నుండును. వ్యవసాయమునకుదగిన నూతనపద్ధతులు హైందవు లెరుఁగరు. వానిని తెలుసుకొనుటకు తగిన చేర్పు వారికిలేదు. మఱియు వారు బీదవారగుటచే నధికధనమును వెచ్చించి వానిని కొనఁజాలరు. కొన్నిచోట్ల భూసారముగూడ నీపనిముట్లతో పని చేయుట కనుకూలమయినది గాదు.

కాన హైందవ వ్యవసాయదారులకు ఎడ్లేయాధారము. నాగళ్ళులాగుటకును, దమ్ము చేయుటకును, కుప్పనూర్చుటకును, ధాన్యమును పొలములనుండి కొట్లకు కొట్లనుండి దేశములకును విదేశములకెగుమతి చేయుటకు రేవుస్థలములకును గొనిపోవుటకును, నూతులలోనుండి నీళ్ళుతోడు మోటలలాగుటకును, నూనె యంత్రశాలలో నూనెగింజల నలుపుటకును, కరవులోను యితర సమయములలోను గూడ మంచినీళ్ళను నదులలోనుండియు నూతులలోనుండియు తోలుసంచులతో మోసుకొనిపోవుటకును, ఇంక నెన్నియో పనులు చేయుటకు నెడ్లుపయోగించును

మరి యావుల యుపయోగము హిందువులలో పెక్కండ్రు కాయగూరలు దినువారుగాని మాంసాశనులు గారు. వారుధాన్యాదులను పప్పుదినుసులను, పండ్లదినుసులను నుపయోగింతురు. పాలు, పెరుగు, మీగడ, వెన్న, నెయ్యి జున్ను మొదలగునవి వారికి ముఖ్యాహారములు. ఆవుపాలు శ్రేష్ఠమును నారోగ్యప్రదమును. ఆవుపాలు లేకున్న పసిపిల్లలు బాలురు వృద్ధులు రోగులు మొదలగువారు బ్రతుకనేలేరు. సర్వకార్యముల కుపయోగించెడు నెడ్లీయావులవలననే కలుగును. గోమయము చక్కని యెరువగుచున్నది. ఈయెరువును పొలములకుపయోగించుచున్నారు. గోమయమును గోమూత్రమును క్రిమి కీటకాదులను దుర్గంధమును నశింపఁజేయు స్వభావముగలిగియున్నవి. పేడ పిడకలుచేసి యెండబెట్టి వంటచెరుకుగా నుపయోగించుచున్నారు. హిందూదేశపు రయితులలో నూటికి 90 మంది పరమదరిద్రులగుటచేత విలువగల యెరువులనుకొని యుపయోగింపశక్తిలేక పేడనే పొలములకెరువు

గనుపయోగించుచున్నారు. పశువులధికముగానున్నగాని పేడయొకువధిక ముగ దొరకనేరదు. దొరకకున్న పంటలు పండవు పండకున్న కాటకములు, మరణములు, దొంగతనములు మెండగును. అదిగాక హిందువులు నేతి నధికముగ త్రాగెదరు. పశువులసంఖ్య తగ్గిపోవుచుండుటచే నిప్పుడీ పాలును నెయ్యియును దేశమునసరిపోవుటలేదు.

తొల్లింటి మహర్షులు జనోపయోగములగు వానిని పవిత్రములనియు పూజనీయములనియు విధించిరి. అట్లువిధించినగాని యవి నిలువంబడవు, ఆచరణములోనికి రావు. అట్లే గోవృషభములు పవిత్రములు వధ్యములుగావనిరి. గోమాంసభక్షణము మహాపాతకమనుటవలన వానిని ప్రజలువధింపమానిరి. పవిత్రమనగా మోక్షమొసంగునసుటగాదు. బహుళోపయోగభరితములని పెద్దలతాత్పర్యము. స్నానముచేయక భుజింపగాదని పెద్దలు విధించిరి. హిందూదేశ ముష్ణదేశము చెమటవిశేషముగా నుండును. స్నానముచేసినగాని పరిశుభ్రతకలుగదు. గాన స్నానముచేసి భోజనము చేయుటవిధియనిరి. తులశితీర్థమును త్రాగవలెను. తులశిదళమును ధరింపవలెనని పెద్దలేర్పరిచిరి. ప్రతియింటను తులశిబృందావనముండవలెను. తులశియందు వాయువును పరిశుద్ధిచేయు గుణమున్నది. ఇంకనెన్నియో సుగుణములుగూడ గలవు అట్లే దేశాభివృద్ధికి మిక్కిలి యుపయోగకరములగు నావులను, ఎడ్లను, మాంసాశనులగువారు తమయాహారమునిమిత్తము వధించినచో నావంగడము రూపుమాసిన వ్యవసాయమునకును, వాణిజ్యమునకును ప్రజల జీవనమునకును సౌఖ్యమునకును కూడ భంగము కలిగి ఘోరప్రమాదము కలుగునని మహర్షిపుంగవులు గోవధ మహాపాతకమని విధించుటచేతనే హిందువులు గోమాంసభక్షణమన్న నెంతమాత్రమంగీకరింపరు.

ఇప్పుడన్నవో యితరమతములవారు గోవధ నంగీకరించుటచే గోవుసంఖ్య క్షీణించి పాలుదొరుకుట కష్టముగనున్నది. వెల హెచ్చుగనున్నది. తల్లులకు స్తన్యములేనిచో పిల్లలకు జీవనాధారము గోక్షీరమే. బీదలగువారట్టి గోక్షీరము నుకొనలేక పోవుటచే పసిపిల్లలచావు లిప్పుడు దేశమున నధికముగ నున్నవి.

గోవధము ప్రారంభమయినది మొదలు దేశమునకు కీడగునని విష్ణుపురాణమునందున్నది. మహమ్మదీయులును, మొగలాయీలును, దేశమునుజయించి గోవధముప్రారంభించిరి. దేశమునకు కీడుగూడ ప్రారంభమయి హిందువులు నానాటికి నిరుపదశకువచ్చుచున్నారు. వ్యవసాయము క్షీణించినది. మతవైషమ్యము అధికమగుటకీ గోవధయే ముఖ్యకారణము. నేటివరకునుగూడ వాద్దోరాటము మారుట లేదు.

హిందూమహమ్మదీయుల సమత్వమునుగల అక్బరుచక్రవర్తి కాలమున గోవధ నివారింపఁబడినది గాని మరల నిటీవల ప్రారంభింపఁబడి నిరంతరాయముగ సాగుచున్నది,

ఇక్ష్వాకుకాటకములు మెండైనవి. అడవులు నశింపచేయబడుటచే వర్షములు తగ్గిపోయినవి వ్యవసాయము చేయుటకు ఎడ్లులేవు. భూములన్నియు బీడుపడియున్నవి. గోవధ యధికమగుచున్నది. పాశ్చాత్యదేశములలో పందులధికముగ వధించుచున్నారు. కాని హిందూదేశమున ఆవులనధికముగ వధించుచున్నారు. సైన్యములోనివారికొఱకు కొరకు మాత్రమే సాలునకు 150000 లక్షలు పదుచుగోవులు వధింపఁబడుచున్నవి. ఇంకమిగిలిన వారికందరికి ఎన్నిగోవులు వధింపఁబడుచున్నవో యూహింపఁదగినది. ఒక్క గోవునుచంపుటయన్న నెన్నియో జంతువులను చంపుట యగుచున్నది. దానిపాలవలన బ్రతుకవలసిన మనుష్యులును దానివలన పుట్టవలసిన పశువులును గూడ చావవలసివచ్చుచున్నది. ఆవును చంపుటలోను యెద్దునుచంపుటలోను కెంత భేదమున్నదో చూడుడు. ఎడ్లునశించిననే దేశమునకు చేటు. ఆవులే నశించిన మఱిచేను చెప్పవలెనా. 50 ఏండ్లనుండి ఇట్లు గోకులము దారుణముగ వధింపఁబడుచున్నది. ఇరువది ఏండ్లక్రితము 10 రూపాయలకు దొరకు వృషభ మిప్పుడు రూ-60 కైనను దొరకుటలేదు. ఒక ఆవునుచంపి యామాంసమమ్మిన వచ్చువిలువకన్న యాయావును పెంచి దానివలనకలుగు పశువులపాలు నమ్ముటవలన వచ్చుసొమ్ము పదిరెట్లధికముగనుండును. కావున నీ సంఘమువారు ఈదుష్పయమును శీఘ్రవహించిన హిందూభయ దేశముల కనుకూలము మైత్రియు నభివృద్ధియగుటకు సందియము లేదు. సర్వ ప్రపంచము

యొక్క యభివృద్ధికిఁగూడ సంఘమువారు తోడ్పడినవారగుచున్నారు. హిందువుల మతవిషయికచింతనుగూడ తొలఁగించినవారగుదురు. భారతీయులందరి కృతజ్ఞతకునుఁగూడ వీరు పాత్రులగుదురు. గోవులుబ్రతికిన పశువులసంఖ్యవృద్ధియగును. పాడిపంటలు వృద్ధియగును. పసిపిల్లలు బీదసాదలు బ్రతికెదరు. వ్యవసాయ మభివృద్ధియగును. వాణిజ్యమభివృద్ధియగును. ఇంతయేల బంగారపుగుడ్లను బెట్టుబాతును జంపుటయెంతమంచిదియో పశువులను పాడినొసంగు గోవులనుజంపుటయు నంతమంచిదియే యని జస్వాలా గారు పన్యశించిరి. భూతదయచేనయిన, దేశోపకారముకొఱకయిన, వ్యవసాయాభివృద్ధికైన, వాణిజ్యాభివృద్ధికైన, సర్వసమత్వమునకైన నేమి ఆంగ్లేయమహాజనులును దొరతనమువారును నీమహోద్యమమునకు తోడ్పడుదురుగాక యని ప్రార్థించుచున్నాము గోకులబాలకుఁడును, గోపాలకుఁడును, నట్టిబాలగోపాలుఁడు కరుణాళుఁడయి గోబృందము నుద్ధరించుగాక.

సువర్ణ రేఖ 7-5-1922

## భవిష్యత్కాలభోజనము.

Our food in future ; by Sir Benzamin Richardson. M. D, F. R. A. S.

భవిష్యత్కాలమునందలి మనభోజనము:

„సర్ బెంజామిన్ రిచార్డ్సన్" అనువైద్యశాస్త్రి మనుష్యుఁడు తన భోజననిమిత్తమై హింసించుజంతువులనుగూర్చి మిక్కిలి దుఃఖముతో కొన్ని సంగతులను వివరించి చెప్పి ఆటుపిమ్మట మనుష్యుని „భవిష్యత్కాలభోజనము" మాంసభోజనమును నిరాకరించును; ఇఁకసంభవించు నాలుగైదు సంతతులవారికాలమున కంతయు మానవులు జీవహింసను బొత్తిగా విసర్జించి సమస్త జీవరాసులను తమసహోదరులవలె లేక తమ కుమారులు కుమార్తెలవలె కాపాడి రక్షింతురు; వాని స్థలమందు ఫలవృక్షములు పెంపొంది పూపూచి ఫలభరితమగును అని జ్ఞానదృష్టితో వివరించెను.

ఆరోగ్యసంస్కారిణి, (విద్యావతి 1909 మార్చి)

గోవధము ప్రారంభమయినదిమొదలు దేశమునకు కీడగునని విష్ణుపురాణమునందున్నది. మహమ్మదీయులును, మొగలాయీలును, దేశమునుజయించి గోవధముప్రారంభించిరి. దేశమునకు కీడుగూడ ప్రారంభమయి హిందువులు నానాటికి నీచదశకువచ్చుచున్నారు. వ్యవసాయము క్షీణించినది. మతవైషమ్యము లధికమగుటకు గోవధయే ముఖ్యకారణము. నేటివరకునుగూడ నా పోరాటము లారుట లేదు.

భూతదయాపరత్వమును సర్వమతసమత్వమునుగల అక్బరుచక్రవర్తి కాలమున గోవధ నివారింపఁబడినది గాని మరల నిటీవల ప్రారంభింపఁబడి నిరంతరాయముగ సాగుచున్నది,

ఇప్పుడు కాటకములు మెండైనవి. ఆడవులు నశింప చేయబడుటచే వర్షములు తగ్గిపోయినవి వ్యవసాయము చేయుటకు ఎడ్లులేవు. భూములన్నియు బీడుపడియున్నవి. గోవధ యధికమగుచున్నది. పాశ్చాత్యదేశములలో ఎడ్లనధికముగ వధించుచున్నారు. కాని హిందూదేశమున నావులనధికముగ వధించుచున్నారు. సైన్యములోనివారికొక్కరికొరకు మాత్రమే సాలునకు 150000 బలిష్టములగు పడుచుగోవులు వధింపఁబడుచున్నవి. ఇఁకమిగిలిన వారికెందరి కెన్నిగోవులు వధింపఁబడుచున్నవో యూహింపఁదగినది. ఒక్క గోవునుచంపుటయన్న నెన్నియో జంతువులను చంపుట యగుచున్నది. దానిపాలవలన బ్రతుకవలసిన మనుష్యులును దానివలన పుట్టవలసిన పశువులును గూడ జావవలసివచ్చుచున్నది. ఆవును చంపుటలోను యెద్దునుచంపుటలోను నెంతభేదమున్నదో చూడుడు. ఎడ్లునశించిననే దేశమునకు చేటు. ఆవులే నశించిన మరివేరు చెప్పవలెనా. 50 ఏండ్లనుండి ఇట్లు గోకులము దారుణముగ వధింపఁబడుచున్నవి. ఇరువది ఏండ్లక్రితము 10 రూపాయలకు దొరకు వృషభ మిప్పుడు రూ—60 కైనను దొరకుటలేదు. ఒక ఆవునుచంపి యా మాంసమమ్మిన వచ్చువిలువకన్న యాయావును పెంచి దానివలనకలుగు పశువులపాలు నమ్ముటవలన వచ్చుసొమ్ము పదిరెట్లధికముగనుండును. కావున నీ సంఘమువా రిందువిషయమయి శ్రద్ధవహించిన నుభయదేశముల కనుకూలముగ మైత్రియు నభివృద్ధియగుటకు సందియములేదు. సర్వ ప్రపంచము

యొక్క యభివృద్ధికింగూడ సంఘమువారు తోడ్పడినవారగుచున్నారు. హిందువుల మతవిషయిక చింతనుగూడ తొలగించినవారగుదురు. భారతీయులందరి కృతజ్ఞతనుంగూడ వీరు పాత్రులగుదురు. గోవులు బ్రతికిన పశువులసంఖ్యవృద్ధియగును. పాడిపంటలు వృద్ధియగును. పసిపిల్లలు బీదసాదలు బ్రతికెదరు. వ్యవసాయ మభివృద్ధియగును. వాణిజ్యమభివృద్ధియగును. ఇంతయేల బంగారపుగుడ్లను బెట్టుబాతును జంపుటయెంతమంచిదియో పశువులను పాడినొసంగు గోవులనుజంపుటయు నంతమంచిదియే యని జస్సావాలా గారు పన్యసించిరి. భూతదయచేనయి న, దేశోపకారముకొఱకయిన, వ్యవసాయాభివృద్ధికైన, వాణిజ్యాభివృద్ధికైన, సర్వసమత్వముకైన నేమి ఆంగ్లేయమహాజనులును దొరతనమువారును నీమహోద్యమమునకు తోడ్పడుదురు గాక యని ప్రార్థించుచున్నాము గోకులబాలకుండును, గోపాలకుండును, నట్టిబాలగోపాలుండు కరుణాళుండయి గోబృందము నుద్ధరించుగాక.

సువర్ణ లేఖ 7-5-1922

## భవిష్యత్కాల భోజనము.

Our food in future ; by Sir Benzamin Richardson.
M. D , F. R. A. S.

భవిష్యత్కాలమందలి మనభోజనము:

„సర్ బెంజామిన్ రిచార్డ్సన్,, అనువైద్యశాస్త్రి మనుష్యుండు తన భోజననిమిత్తమై హింసించుజంతువులనుగూర్చి మిక్కిలి దుఃఖముతో కొన్ని సంగతులను వివరించి చెప్పి ఆటుపిమ్మట మనుష్యుని „భవిషత్కాలభోజనము,, మాంసభోజనమును నిరాకరించును; ఇఁక సంభవించు నాలుగైదు సంతతులవారికాలమున కంతయు మానవులు జీవహింసను బొత్తిగా విసర్జించి సమస్తజీవరాసులను తమసహోదరులవలె లేక తమ కుమారులు కుమార్తెలవలె కాపాడి రక్షింతురు; వాని స్థలమందు ఫలవృక్షములు పెంపొంద పూపూచి ఫలభరితమగును అని జ్ఞానదృష్టితో వివరించెను.

ఆరోగ్యసంస్కారిణి, (విద్యాపతి 1909 మార్చి)

ఓమ్

# జీవ కారుణ్యము.

## చతుర్థలహరి.

### మద్యమాంసనిషేధశాస్త్రసంగ్రహము

### వేదములు

యేవాజినంపరిపశ్యన్తి పక్వంయఈమాహుఃసురభిర్నిహ-

రేతి। యేచార్వతో మాంస భిక్షాముపాసత ఉతో తేషామ

భిగూర్తిర్న ఇన్వతు.

(ఋగ్వేదము-మండ-౧- అష్టక ౨- సూక్తము ౧౬౨-మంత్ర ౧౨)

అన్నమును జలమును శుద్ధిపరచి పక్వముచేసి భుజించుటను ఏమనుష్యులు గనిపెట్టుదురో, ఎవరు మాంసమును విసర్జించి శుద్ధాన్నమును భుజింతురో అట్టివారు శ్రేష్ఠులగుదురని తాత్పర్యము.

ఇమమూర్ణాయుంవరుణస్య నాభింత్వచంపశూనాంద్వి

పదాంచతుష్పదాం । త్వష్టుఃప్రజానాం ప్రథమంజనిత్రమ

గ్నేమాహింసీః॥

(యజుర్వేదము-అధ్యా ౧౩-మం-౫౦)

రెండుకాళ్ళుగల మనుష్యపక్ష్యాదులను, నాలుగుకాళ్ళుగల గోవాది పశువులను మేకలు గొఱ్ఱెలు మొదలగువానిని హింసింపకుండనితాత్పర్యము.

ఘృతందుహానామదితిం జనాయాగ్నే మాహింసీః॥

(యజుర్వే-అధ్యా ౧౩-మం ౪౯),

ఘృతమునిచ్చునవియును రక్షాయోగ్య మయినవియునగు పశువులను హింసజేయకుండని తాత్పర్యము:

పశూన్ పాహి॥

(యజుర్వే-అ-౧-మం-౧)

(ఓ జనులారా! మీరు ఆవు, గేదె, గుఱ్ఱము, మేక, మొదలగు) జంతువులను రక్షింపుడని తాత్పర్యము.

ఇమంమాహింసీరేకశఫంపశుమ్॥

(యజుర్వే.౧౩-మం-౪౮).

ఓజనులారా! ఒక్కగొరిసెగల పశువులగు గుఱ్ఱముమున్నగువానిని హింసింపకుండని తాత్పర్యము.

యఆమంమాంసమదన్తి పౌరుషేయంచయేక్రవిః। ×
ర్భాన్ ఖాదన్తికేశవస్తానితో నాశయామసి॥

(అథర్వవేద-కాం-౮-అను-౨సూ ౬-మం-౨౩).

అనగా — ఎవడు మాంసమునుతినునో, ఎవడు గుడ్లను భక్షించునో, వానిని రాజు నాశపఱచఁదగునని తాత్పర్యము.

ఉపనిషత్తులు.

ఆహారశుద్ధౌసత్వశుద్ధిః, సత్వశుద్ధౌధ్రువాస్మృతిః॥

(ఛాందోగ్యోపనిషత్తు.)

ఆహారశుద్ధిచే భావశుద్ధియు దానిచే స్థిరత్వమును కలుగుననుట,

## శాస్త్రములు.

అహింసాపరమోధర్మః అహింసాపరమంతపః।
అహింసాపరమందానం ఇత్యాచుర్మునయస్తథా

ఏప్రాణినైనను హింసింపకుండుటయే ధర్మమని, గొప్పతపస్సని, గొప్పదానమని, ధర్మశాస్త్రకారులగు మునులు వచించియున్నారు.

## సూత్రములు.

తత్రాహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యపరిగ్రహాయమాః

(యోగదర్శనము-సాధనపాదము-సూత్రము ౩౦)

(అష్టాంగయోగములలో మొదటిదగు) యమమునకు, అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను నైదును ముఖ్యాంగములని మహామునిపతంజలి వచించెను.

దుష్టంహింసాయామ్ తస్యసమభిహారతోదోషః॥

(వైశేషిక-అధ్యా ౬. అహ్ని ౧ సూత్ర-౭౧)

ఎవడు మద్యమాంససేవనాది దురాచారరతుడో వాడు దుష్టుడనంబడును. వాని సాంగత్యముగూడ దోషకరమని, కణాదముని వచించెను.

## స్మృతులు,

నాకృత్వాప్రాణినాంహింసాం మాంసముత్పద్యతేక్వచిత్।
నచప్రాణివధస్స్వర్గ్యః తస్మాన్మాంసంవివర్జయేత్॥

(మనుస్మృతి-౫-౪౮).

జంతువులను హింసింపకయే మాంసము చిక్కదు. ప్రాణులను వధించుటచే స్వర్గప్రాప్తికి హానికలుగును. కావున మాంసభక్షణమును విడనాడవలెను. *

మద్యమాంసరతంనిత్యం నీచకర్మప్రవర్తకం।
తంశూద్రంవర్జయేద్విప్రశ్శ్వపాకమివదూరతః॥
(పరాశరస్మృతి-౧౧ అధ్యా).

మద్యమాంససేవనమందాసక్తికలిగి సదా నీచకార్యములు చేయుచుండు శూద్రుని, చండాలునివలె బ్రాహ్మణుడు త్యజింపవలెను.

ఇతిహాసములు

ఆ॥ కల్లు, లక్క, యుప్పు, గరళంబు, లోహంబు
పలల (మాంస) మమ్మ పోష్యవర్గములను
బ్రోచువానిగతికిఁబోవును శ్రీరామ
కానకరుగుటెఱుగు కలుషబుద్ధి.
(ఆంధ్ర, రామాయణము).

(భరతప్రతిజ్ఞ) ఓతల్లీ! కౌసల్యా! శ్రీరాముడరణ్యమునకరుగుట, లోనాకేమైనఁ దెలిసియున్నచో, కల్లు, లక్క, ఉప్పు, విషము, మాంసము మొదలగు వానిని విక్రయించెడి పాపాత్ముడేగతికిఁ బోవునో ఆగతికిపోయెదనని వచించె.

మొట్టమొదట, క్రౌంచపక్షులను జంపిన బోయవానిని శపించిగదా వాల్మీకి రామాయణమును చెప్పనారంభించె.

* మనుస్మృతి 11-వ అధ్యాయమున మద్యపానము చేయువారు పంచమహాపాతకులని చెప్పఁబడినది.

అది యహింసాధర్మస్థాపనము గాదా?

"వాజిమేధంబుకంటెనుఁ బూజనీయ
కర్మమందురు మాంసభక్షణము విడుపు
వినుము చంపుటయును చంపఁబనుచుటయును
కల్మషంబులకెల్ల నగ్గలము లధిప.

గీ. విను మాంసముగోరునరుడు
దనుజుఁడచూవె.—

ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁబో
షించుననుటకంటె చేటులేదు
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలులేదు కర్మజాలకమున.

(మహాభారత-అనుశాసనికపర్వము,)

మాంసభక్షణము మిక్కిలి హేయమని భీష్మాచార్యులవారు ధర్మ[రా]జున కెఱింగించిరి.

గీతలు.

ఆయుస్సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
[ర]స్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః
ఉచ్ఛిష్ట మపిచామేధ్యం భోజనం తామసప్రియం॥

(భగవద్గీత)

ఆయుస్సత్వబలారోగ్య సుఖానంద వివర్ధనములగు మంచిపదార్థము[లు] సాత్త్వికులకు ప్రియము. ఎంగిలి, అపరిశుద్ధము, మున్నగు వానితోఁగూ[డి]ని తామసులకు ప్రియమని శ్రీకృష్ణభగవానులు వచించిరి.

## — పురాణములు. —

మ. తనదేహంబునకై యనేకమృగసం
తానంబుఁజంపించు దుర్జనుభంగిఁ.

(భాగవతము-ప్రథమస్కంధము.)

కం. నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోటి నెయ్యము నితాం
తాపారభూతదయయును
తాపసమందార! నాకు దయసేయగదే.

(భాగవత-దశమ)

తే. గీ. అన్నితపములకును బెద్ద యన్నిదాన
ములకు నెక్కువ యన్నినోములకు హెచ్చు
అన్నితీర్ధములకునుఁ గన్నాకు వినుమ
భూతదయకంటె ధర్మంబు భూమిలేదు.

(దేవీ-భాగవ- 4 వ స్కంధము).

### జంతుహింసచేయకపోయినచో
### పాదరక్షలు మొదలగునవెట్లు దొరకగలవు?

పశ్వాదులను చంపనియెడల పాదరక్షలు మొదలగునవెట్లు దొరకునని కొందఱు వాదింతురు. ఈవిషయమై యొకక్రైస్తవునకును, కేశవలాల్ అను వతనికిని జరిగిన సంవాదములో లాల్ గారిట్లు సమాధానమిచ్చియున్నారు.

(Mr. Christian) If vegetarianism is established where are we to go for leather and what are we to do for clothes to the sick.

Mr. Christian need not alarm himself about the dislocation of the boot trade, the harness trade and a hundred others. Vegetarion boots, vegetarian soaps and vegetarian candles are now in the market fortunately. "Mankind is not so helpless" so uniaventive, so literally "hide bound" as to let its progress depend on skins, bones and guts (........... KeshnvLal, B. A.)

ప్రియమైన క్రిశ్చియను గారూ! వృక్షసంబంధమైనపాదరక్షలు, మైనపువత్తులు మున్నగునవి విస్తారముగనున్నవి. బోస్తులకై కల్పవృక్షము వసుకవలెనన్నట్లు పాదరక్షలకై జంతువులను చంపవలెనా!

The Manchester City News of November 30th said:— "There's nothing like leather, says the old adage; but at the Vegetarian Exhibition which opened on Thursday at the Wilton Hall, Deansgate, they have at least proved that there are effective substitutes. Boots, gloves, attache bags, and many other articles of a like nature, none of them made from the skins of animals, are to be seen and handled, (............Harbinger, 14-2-1913)

మ్యాంచస్టరు. డీన్సుగేట్. విల్టన్,హాలులో స్థాపించియుండు వస్తుపరిదర్శనశాలలో శాకాసంబంధమైన బూట్సులు, చేతిసంచులు, గూటలు మున్నగు నెన్నియో యుపకరణములు చర్మసంబంధము లేకనే తయారు చేయబడినవి సిద్ధమైయున్నవి !!

## నీ తి శా స్త్ర ము

శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం॥

కోటిగ్రంథములసారాంశ మొకయర్ధశ్లోకముతో చెప్పెదను, అదే మనః పరుల కుపకారము చేయుటచే పుణ్యముకలుగును. పరులను పీడించుటచే పాపముకలుగును.

## మూర్షిదాబాదు నవాబుగారు

మూర్షిదాబాదు నవాబుగారు రాగల బక్రీద్ పండుగనాడు తమ సంస్థానములో ఎవరును గోహత్య చేయకూడదని చట్టము విధించినందుకు హిందువులగు మనమెల్లరమును కృతజ్ఞులమై యుండవలెను.

ఒక్కలిగరపత్రిక 1-1-1913

## ద్రావిడప్రబంధము-తిరువాయ్మొళి

శ్రీభగవద్గుణానందాధికముచే మోహించి మూర్ఛితులై పడియుండిన శ్రీనమ్మాళ్వారుల కడకొక శాక్తేయపరివర్తకయగు ఎఱుకసానివచ్చి మద్యమాంసమును క్షుద్రదేవతకు నివేదించి యెల్లరును బుచ్చుకొన్నచో వారిమూర్ఛ తేరునని చెప్పగా నట్లు చేయనారంభించిరి. అంతలో వారి ఆప్తసఖివచ్చి యీదురాచారమును వారించి వారితో నిట్లనియె- మూర్ఛ తేరినపిదప ఆళ్వారులు దానిని తమప్రబంధములో చేర్చుకొనిరి.

అదేవన! తిరువాయ్మొళియందు రవపత్తు ౬-వ తిరువాయ్మొళి 3-వ పాశురమున నిట్లనియానతిచ్చియుండెదరు:—"ఇనుకాణ్మిన్నై మీరి క్కట్టువిచ్చి శొల్లక్కొండు, నిర్! ఏత్తువానుం శెయ్దక్షేర్ కళ్ళుమిత్తె చ్చిఱుమ్ తూవేల్మిన్ మతువార్ తుళ్యమ్ముడి మాయప్పిరాన్ కళల్ వాళ్తివాల్ అతువే యివళ్ళు నోయ్క్కుమరు మరుందాగుమే."

ఇది మూఢుడి అమ్మలారా! ఈయెఱుకిత మాటనుగొని ఏదేనియుంజేసి అక్కడ ఏమాత్రమును మద్యమునుగాని మాంసమునుగాని వినియోగింపకుడి; మకరంద స్యందియగు తులసిమాలికను శిఖయందుగల ఆశ్చర్యగుణచేష్టితములకు కర్తయగు స్వామియొక్క పదకమలమును స్తోత్రముచేసితేని అదియే వీరికిగల బాధకు దివ్యౌషధము: 6-వ మొళి 4-వది 7-వ పాశురము. మరుందురైనుప్ఱిఅజ్ఞాన అమునకళ్ళుంపరాయ్,

ఔషధమని అచ్చుటకల్లును సారాయని ఉపయోగింపకుడు.

ఇటుల శ్రీవైష్ణవమతప్రవృత్తికి మొదలు శాక్తేయమతముం డెననియు శ్రీఆళ్వారులాదిగల సదాచార సంపన్నులు దానిని మాన్పుచు వచ్చిరనియు స్పష్టమగుచున్నది.

గంజావపినిక్కళ్ళుంపు వాడామల్ పంజామిర్త పగరువదు మెక్కాలుమ్

(భద్రగిరిస్వాములు.)

గంజాయి, అపిని, కల్లు, మున్నగువానిని త్రాగిచెడవము, తత్స్వామృతమును సర్వదా పానముచేయుమని తాత్పర్యము.

పులైయుం, కొలైయుం, కళవుం తవిర్.

(అవ్వ)

మాంసభక్షణమును, జీవహింసను, దొంగతనమును విడిచిపెట్టుమని తాత్పర్యము.

నుత్తినవనై జ్ఞా (న్యా) నియెన్రుకూరొణ్ణదు

(తిరువళ్ళువర్)

జీవహింసచే కలుగుమాంసమును భుజించువానిని జ్ఞానియని వచింపరాదు.

## జ్ఞానుల వాక్యములు.

శ్లో॥ వైరూప్యం వ్యాధిపీడా స్వజనపరిభవః కార్యకాలాతిపాతీ
విద్వేషోజ్ఞాననాశః స్మృతిధృతిహరణం విప్రయోగశ్చసద్భిః
పారుష్యంనీచసేవాకులగిరిచలనం ధర్మకామార్థహానిః
కష్టంభోషోడశైతే నిరుపచయకరామద్యపాన స్యదోషాః

తా॥ మద్యపానము (కల్లు) వలన కురూపులును, రోగపీడితులునై స్వజనులచేత అవమానమునొందుచున్నారు. వారు వ్యర్థముగా కాలహరణము చేయుచున్నారు. అందరిచేతను ద్వేషింపబడుచున్నారు, వారి జ్ఞానము

నాశనమగుచున్నది. జ్ఞాపకశక్తియు ధైర్యమును లేకపోవుచున్నవి. సజ్జనులు వారి సాంగత్యమువదలెదరు. వారు క్రూరులను, నీచులను, సేవించువారును కులభ్రష్టులును అగుచున్నారు. ధర్మము, అర్థము, కామము (అనగా మోక్షేచ్ఛ) లేకపోవుచున్నవి. ఇట్లు పదునారుదోషములకు మనుష్యులు పాత్రులగుచున్నారు. కావున మద్యపానమును విడిచిపెట్టవలెను.

## క్షురక్షః పిశాచాన్నం మద్యం మాంసం సురాసవమ్.

అనగా సారాయి, మాంసము, కల్లు, ఆసవము పుష్పసారాయము, అను నివి యక్ష, రాక్షస, పిశాచములకు ఆహారము. (అనగా మానవులువీనిని త్యజింపవలెననుట).

రక్తమాత్రవివాహేణ స్త్రీనింద్యాంజాయతేస్ఫుటం
ద్విధాతుజంపునర్మాసం పవిత్రం జాయతేకథం.

(పూజ్యపాదులు)

రజోదర్శన (బహిష్ఠ) మాత్రముచేతనే స్త్రీదోషము కలదియగుచున్నది, ఇట్లుండ శుక్రశోణితములను (రెంటివలన) కలుగు మాంస మెట్లు యోగ్యమగును? (అనగా అశుద్ధమనుట)

శ్లో॥ శుక్రశోణితసంభూతం త్రసాంగిసంకులంపలం
తద్భోజీనరకంయాంతి యావచ్చంద్రదివాకరౌ.

(మాణిక్యమాల)

శుక్రశోణితములచే కలుగునట్టి మాంసము త్రసజీవుల (పురుగుల) చేత నిండియున్నవి. దానిని భుజించువారు సూర్యచంద్రులుండు నంతకాలము నరకమున దుఃఖమనుభవింతురు. అని యసంఖ్యాత మహావాక్యములు మద్యమాంసాదులను నిషేధించుచున్నవి.

## గోమాంసభక్షణ, సురాపాన శబ్దార్థవిచారము.

యోగాభ్యాసము చేయువారు గోమాంసభక్షణ సురాపానములు చేయుటవలన యోగసాధనమగుననికొందరు వచింతురు. దానిని నమ్మి యనే

ములు యోగమునకు అభక్ష్య భక్షణాపేయపానములే ముఖ్యసాధనములని భ్రమించి తత్సేవనఁ జేయుటచే నుభయభ్రష్టులై రెంటికిఁ జెడిన "రేవణ' లగుచున్నారు. ఇదిమిక్కిలి శోచనీయము. దీనిఁగురించి యోగశాస్త్రము నందీరీతిగా వ్రాయఁబడియున్నది.

శ్లో॥ గోశబ్దేనోదితాజిహ్వా తత్ప్రవేశోహితాలుని
గోమాంసభక్షణంతత్తు మహాపాతకనాశనమ్.

గో అనగా నాలుక, నాలుకను చిరునాలుకపై భాగము అనగా అంగిలి ద్వారమునందు ప్రవేశపెట్టుట; గోమాంస భక్షణము అది పాప నాశనము జేయునని గా నున్నది,

శ్లో॥ జిహ్వాప్రవేశసంభూత వహ్నినోత్పాదితఃఖలు
చన్ద్రాత్స్రవతి యస్సారః సస్యాదమరవారుణీ.

అట్లు నాలుకను అంగిలియందు ప్రవేశపెట్టుట వలన కలుగు ఉష్ణము (అగ్ని చేత (భ్రూస్థానము యెడమప్రక్కనుండు) చంద్ర (స్వర) స్థానము నద్దనుండి స్రవించునట్టి రసము అమరవారుణి (సుర) యనంబడును. అట్టి సుర ను పానముచేయు వారికి సోమపాన ఫలము ను, యోగసిద్ధియు లభించునని యోగశాస్త్రములు చాటుచున్నవి.

(జంతుహత్యయే నరహత్యకుపునాది.)

"కఠినచిత్తులకేలబ్బు కనికరంబు'' అను పండితోక్తి ననుసరించి, జీవహత్యజేయుట కలవాటుపడినవారికి దయాదాక్షిణ్యములేమాత్రముండవు అట్లు పశ్వాది తిర్యగ్జంతువులను అప్పుడప్పుడు జంపుచుండుటచే హృదయము క్రూరభూయిష్ఠమై "ప్రాణము తీయుటనగా నొక లెక్కలేక మదాంధులై సంచరించు మానవరూప రాక్షసులు తుదకు నరహత్య చేయుటొక యాశ్చర్యము కాదు; ఇట్టిదుస్సహవాసమున మరిగియుండుటచే, అగ్రవర్ణ నామధారులు సయితము కొందఱిట్టి రాక్షసకృత్యములకు పాల్పడుట తట

సించుచున్నది. ప్రవృత్తిమార్గము పనికిరాదు. (అనగా) మాంసభక్షణ, సుర పాన (కల్లుత్రాగుట) అన్యస్త్రీ సంయోగములు, ప్రాణులకు దోషము కలుగ జేయునని ప్రవృత్తిశాస్త్రము చెప్పుచున్నది, (ప్రవృత్తిమార్గమనగా, పారమార్థికచింతనలేక సదాపాపకర్మములాచరించుచు చచ్చుచు పుట్టుచుండుట) వీనినివర్జించినయెడల మహాఫలముగలుగునని నివృత్తిశాస్త్రము చెప్పుచున్నది. (నివృత్తిమార్గమనగా; నీచమైన పాపబంధనములనుండి తొలగించుకొని నిత్యానందము జెందగోరుట).

Bruelty to Animals naturally indicates and promotes a habit of mind which leads to cruelty to men.

(Lecky).

జంతుహత్యచేయువారి చిత్తము తుదకు నరహత్యకు పాల్పడునని. లెక్కీ యను విద్వాంసుడు వచించెదిని !

వేమనయోగి.

ఆ॥ మాంసము తనకున్న మాటను మరచుచు
మాంసముదినుపట్టి మాయజీవి
మాంసముచెడిపోవ మాటెట్టులాడురా
విశ్వదాభిరామ వినురవేమ.

ఆ॥ హింసచేయరాదు సంసారధర్మంబు
వెనుకజంపుమరట వెతలబెట్టి
చావుపశువు తినెడి చండాలుడే వేళ
విశ్వదాభిరామ వినురవేమ.

నారసింహయోగి.

గీ॥ సారాయిత్రాగుట సభకుయోగ్యముకాదు
కల్లుద్రాగుటమొదట కానెకాదు

వీనితాగుకన్న విషముతాగుట మేలు.

నారసింహదాస నారసింహా

## మధుపర్కవిచారము

మాంసాహారము సనాతనాచారము కాదని యొక గ్రామములో నుపన్యసించుచుండగా, నొక శాస్త్రుల వారీవిధమున బూర్వపక్షము చేయ నారంభించిరి.

శాస్త్రి:— పూర్వకాలమున మాంసాహారము వాడుకయందుండెననుటక నేక దృష్టాంతములు కలవు. దానికి మీరేమిచెప్పెదరు ?

ఉపన్యా:— పూర్వకాలమందుండెనని గ్రంథాదులలో కొన్ని వాక్యములు కలవు. దానిని మే మెఱుంగుదుము. ఆవాక్యములు కుకల్పితములు, ప్రక్షిప్తములను మేమంగీకరింపము.

శాస్త్రి:— ప్రక్షిప్తమన్నచో మీవాక్యములే యేల ప్రక్షిప్తములు కాకూడదు దీనికి పరిహారమేమి ?

ఉపన్యా:— పరిహారమునకేమి, ఎంతయో గలదు. ఉత్తమబ్రాహ్మణులు దాని నంగీకరింపరు. మాంసభక్షణాదులు దురాచారమగుటచేనది బ్రాహ్మణాదులచే నిషేధింపబడియున్నది. భక్తులు ముక్తులాదిగా నెవరును మద్యమాంసములను సేవింపలేదు. అది మిక్కిలి హేయమయినది. జీవహింస కాకరమయినది. శ్రేష్ఠులచే వర్జింపబడినదగుటచే నది దురాచారముగా పరిగణింపబడుచున్నది.

శాస్త్రి:— ఔను మనకు పూర్వగ్రంథములేగదా ప్రమాణము? పూర్వులకాలమున బ్రాహ్మణాదుల యిండ్లకు సయితము రాజులు మున్నగువారు వచ్చినప్పుడు గొడ్డు, గేదెనో, ఆవునో, ఎద్దునో చంపి మధుపర్క మిచ్చుచుండిరని గృహ్యసూత్రాదులలో మనము చూచుచుండలేదా?

ఉపన్యా:— అట్టివాక్యములుండుట నిజమేకాని, యవి దుష్కర్ములగు నవార్యులచే కల్పింపఁబడినవి.

తద్యథై వాన్యేమనుష్య రాజఆగతేం థస్మిన్
వేహాంతవాహాఁణం త్యుక్షాణంవాక్షదంతే॥

ఇత్యాది బ్రాహ్మణ శ్రుతివాక్యములను గృహ్యసూత్రములందలి కొన్ని వాక్యములను ఆధారపఱచుకొని, మధుపర్కమనగా గొడ్డు గోవును హతపఱచి. యతిథులగు రాజులాదిగాగలవారికి (జామాతలకు) పలల చర్మాదుల నర్పించుటయని గతానుగతికముగా భ్రాంతిఁజెందుచుండుటకు హేతువేర్పడినది. కరుణఁగల వారెవరును ఈప్రక్షిప్తవచనముల నంగీకరింపరు.

శాస్త్రి:— మరి మధుపర్కమనగా నేమి?

ఉపన్యా:— మరల నడుగనేల ? పరమదయావంతులగు ఆర్యులచే ననుష్ఠానమునకు తేబడియుండు "దధిసర్పిర్జలంక్షౌద్రం సితాచైతేస్తుపంచభిః ప్రోచ్యతేమధుపర్కస్తు" ఇత్యాది ప్రమాణముల ననుసరించి పెరుగు నేయి, నీళ్లు మున్నగువానితో సిద్ధపఱుపఁబడునదే మధుపర్కము. ఈయర్థమును విడనాడి మిథిలానగరమునందు, అట్లే భరద్వాజాశ్రమమునందును శ్రీరామాదులు ఎద్దుమాంసముఁ దినిరనియు, ధర్మరాజాదులు మాంసముఁదినిరనియు వచించుచు ప్రక్షిప్తవచనములనే నమ్ముకొని విడకరించుచుండెడి దురభిమానులఁబోలి మనకేల? యని విన్నవింపగా శాస్త్రిలు సమ్మతించిరి. జనులారా ! హెచ్చరిక, హెచ్చరిక.

## మద్యపానము.

ధర్మవిధ్వంసకుల దుర్వాదముల కుత్తరములిచ్చుట మిక్కిలిదుస్తరము. కొందఱిట్లని వాదించెదరు. ఔనండీ ! మాంసమును దినవలసినచో జీవహింస చేయవలెను. అది మహాపాపమని వచించితిరి. సరే, కాని ఏజంతువునను హింసకిలుగలేక నిరుపాధికముగా చెట్లనుండి స్రవించెడి, కల్లు సారా

యములనెందుకు త్రాగరాదు. అందేమిదోషముకలదని దురూహలనే సమాధానమిచ్చువారెందరో కలరు.

మద్యపానముచే జీవహింసకలుగకున్నను గొప్పగొప్ప కుటుంబముల యభివృద్ధికి వేరుపురుగై యనేకులను బుక్కాపకీరులను గాంజేయు దుర్వ్యాధుకలలోనెల్ల నగ్రగణ్యమయినది మద్యపానము. దీనిచే దేశీయులకు సంభవించెడి కష్టమునుగురించి, మాగ్రంధమాలకుఁ జేరిన, కలిమహిమయను గ్రంధములోవిపులముగా వర్ణింపఁబడియున్నది. త్రాగుబోతుతనము మనదేశమునం దెంతవడిగా వ్యాపించుచున్నదనుట క్రిందిలేఖయే గొప్పనిదర్శనముగనున్నది.

## చెన్నరాజధానిలో త్రాగుడు.

చెన్నపురి దొరతనమువారు ప్రకటించిన 1911 సంవత్సరపు ఆబ్కారీ పరిపాలనా వృత్తాంతమునుబట్టి మనరాజధానియందు త్రాగుడు, మత్తుపదార్థముల యుపయోగమును నెట్లు విపరీతముగా వృద్ధియగుచున్నదియు, స్పష్టము కాగలదు. కడచిన సంవత్సరము ఫిబ్రివరునెలలో శాసననిర్మాణ సభయందు గౌరవనీయులగు త్యాగరాయ శ్రేష్ఠిగారు త్రాగుడు దురభ్యాసమును తగ్గించుటకై కొన్నిమార్గములను విచారణకు దెచ్చిరి. వీనిలో సారాయి యొక్క బలమును 30 డిగ్రీలనుండి 35 డిగ్రీలకు తగ్గించు విషయమును, పదునారేండ్ల లోపు బాలురకు సారాయి విక్రియమును మాన్పుటయు దొరతనము వారంగీకరించినను, వీనికి సంబంధించిన విషయమేమియు రిపోర్టులో గానవచ్చుటలేదు.

సంఘసంస్కర్త లెంతప్రయత్నించినను, గడచిన పదియేండ్లలోను త్రాగుడును, త్రాగుడుపై నాదాయమును, దాదాపుగ రెండురెట్లు అధికమైనవి. దొరతనమువా రధికముగా పన్నులు విధించుచున్నను, త్రాగుడుబారి. త్రాగుడు పెరుగుచునే యున్నది

## సారాయములు.

| సం॥ | షాపులు | గేలనులు | ఆదాయము, |
|---|---|---|---|
| 1908 | 10123 | 1707136 | 11074501 |
| 1909 | 9099 | 1511570 | 11409657 |
| 1910 | 8900 | 1538475 | 11384116 |
| 1911 | 8724 | 1629178 | 12551127 |

ఈపట్టీని బరీక్షించువారలకు, 1908 సంవత్సరపు 10123 దుకాణములను 1911 నాటికి 8724 వఱకు తగ్గింపబడినను, క్రమముగా, సరుకును, నాదాయము నెట్లు వృద్ధియగుచున్నదియు నాశ్చర్యముగొల్పును. వృద్ధికనిపించుచున్న 8973 గేలనులలోను, 14852 గేలనులు గుంటూరు తాలూకాలో ఖర్చుబడినవి. దక్షిణకన్నడము, మళయాళము, గంజాము, విశాఖపట్టణము, నీలగిరిజిల్లాలు, కర్నూలు, చెంగల్పట్టులయందు దొరతనమువారు పన్నువృద్ధిచేసినను, ప్రజల త్రాగుబోతుదనమున కేమియు నాటంకము రాలేదు. దొరతనము వారింకను పన్నువృద్ధి చేయుటకై యోజించుచున్నారు. సారాయి యంగళ్ళను బెట్టువిషయమున స్థానికసభలను సంప్రదించిరని తెలియవచ్చుచున్నది గాని, వీరి సంప్రదింపు నిరుపయోగముగనే కనుపట్టుచున్నది.

ఇఁక కల్లువిషయ మెట్లున్నదో చూడుడు.

| సం॥ | గీతచెట్లు | షాపులు | గేలనులు | ఆదాయము |
|---|---|---|---|---|
| 1908 | 2752631 | 17161 | 104788767 | 11867716 |
| 1909 | 2738593 | 16212 | 103411007 | 12721272 |
| 1910 | 2717799 | 15859 | 103093362 | 13400586 |
| 1911 | 2802980 | 15485 | 106937147 | 14390935 |

దుకాణములు క్రమేణ తగ్గుట సంతోషకరముగనే యున్నది గాని, గీయబడినచెట్లును, ప్రజలుపయోగపఱచు సరుకును, దొరతనము వారికివచ్చు నాదాయమును విపరీతముగా పెరిగిపోవుచున్నవి. దుకాణములు అద్దెలకంటె

గీతవలన వచ్చునాదాయము విశేషముగానున్నందున ఇతరజిల్లాలయందు చెట్లపన్ను వృద్ధిచేయుటకు దొరతనమువారు యోచించుచున్నారు.

1908 సంవత్సరమున దొరతనమువారికి అబ్కారీమూలమున 255 లక్షలఆదాయమువచ్చుచుండెను. 1909 లో 271 లక్షలకును, 1910 లో 277 లక్షలకును 1911 లో మూడుకోట్లకునువృద్ధియైనది. ఇంత ఆదాయమునర్కారువారికి వచ్చునపుడుదొరతనమువారుసాధారణముగా దానిని వదలిపెట్టుటకు సమ్మతింపరు. ఇదంతయురయిల భాగ్యమునకు నిదర్శనమనియేవారువాదించెదరు. ప్రజల ఆర్థిక. నైతిక, ధార్మిక జీవితమునెల్లభంగముచేసి, భ్రష్టులుగానొనర్చు నీదురభ్యాసముపట్ల దొరతనమువారు ద్రవ్యమునుగాక, దానికంటెనధికమగు ధర్మమునే చూడవలసియున్నది. ముందు పత్రికయందు మనతెలుగుదేశపుత్రాగుడు గూర్చి చర్చించెదము,

(ఆంధ్రపత్రిక. 5-2 1913)

## త్రాగుడువలన గలుగు విపత్తులు.

కల్లుసారాయి మున్నగు మత్తుపదార్థములను సేవించుటచే ఎన్నియోయపాయములు కలుగుచున్నవి గాని, మిక్కిలిఘోరమైన యొకటి క్రిందవ్రాయఁబడుచున్నది. నిత్తై బర్గులోనొక త్రాగుబోతు తుపాకితో తనభార్యను, యామను, పావగాకద్దతిని- మరదండ్రనిద్దఱిని, గాయపఱిచి తాను ఆత్మహత్య చేసికొనెను. మద్యపానపుచెడుగును ఎంతవర్ణించినను జాలదుగదా;

(ఒక్కలిగరపత్రిక 7-1-1914)

## పోతులూరి వీరబ్రహ్మయోగి

తత్త్వము.

కల్లుభంగు సారాయులు త్రాగుచు
ఒళ్ళుమరువమన కేలనయా,

## ఎడిసనుదొరగారి యభిప్రాయము.

ప్రఖ్యాతిగాంచిన అమెరికా దేశవాసియు, నవీనయంత్రతంత్రనిర్మాణచాతురీ ధురీణుఁడును నగు ఎడిసన్ అను నతఁడిట్లువక్కాణించెను.

### Health.—ఆరోగ్యము.

ఈప్రకృతిశాస్త్రవేత్త ఇంగ్లండును చూచుటకై అమెరికానుండివచ్చియుండెను. ఈయన ఫ్రెంచివారి క్షీణతకు కారణము వారు సిగరెట్లను తెగత్రాగుటయనియు............ఇంగ్లీషువారికి విస్తారము దేహపరిశ్రమ కావలసినచ్చుట భుజించినమాంసపుముద్దలను జీర్ణించుకొనుటకని ఈయన వక్కాణించెను. మనుష్యులు మితభోజనము చేసినయెడల శరీరపరిశ్రమయే వారికవసరములేదని ఎడిసనుగారిమతము. .. ... ...యంత్రములు సాగుటకై కొద్దిగా మనము ప్రతిదినము నూనెను వేయునట్లే మన శరీరయంత్రమును నడుపుటకు మిక్కిలి కొద్దిగా దినినచోఁ జాలును. ఇట్లుతినువారు నూరు (100) సంవత్సరములనాయాసముగా బ్రతుకగలరనియు దీర్ఘాయువుయొక్క రహస్యమిదియే యనియు జెప్పినాడు. తాను నిస్సందేహముగా నూరుసంవత్సరములకు పైగా బ్రతుకగలఁడట. మత్తుకుకారణము మితాహారభక్షణము,... ... ... ...(ఇట్లు) ఎడిసనుగారనిరి.

ఆంధ్రపత్రిక. 15—11—1911.

### కుకల్పితవాక్యములు.

నమాంసభక్షణే దోషో నమద్యే నచమైథునే॥

(మనుస్మృతి 5-56).

మద్యమాంససేవనచే దోషములేదని ప్రక్షిప్తపరచన శ్లోకమిది. దీనిపూర్వశ్లోకమునందే (5-55) మాంసభక్షణము దోషమని వ్రాయఁబడియున్నది.

## పిశాచశబ్దార్థము.

పిశతి శరీరావయవో భవతీతిపిశితం॥

శరీరమునకు అవయవమగుదానికి పిశితము అనగా మాంసమని పేరు.

పిశితమశ్నంతీతిపిశాచాః॥

మాంసమును భుజించువారికి పిశాచములని పేరు. శ్మశానభూమియందలి శవమును పీకితినెడి గృధ్రి, జంబుకాదులవలె ఊరిలో జంతువులను జంపి యాశవములను భక్షించు దురాచారులు పిశాచములు కాక మరేమి? క్రూర పిశాచములు!!

### పనికిమాలిన పద్యములు.

క. ఖగపతి యమృతము తేగా
భుగభుగమనిపొంగి చుక్క భూమినిపొరలెన్
పొగచెట్టయిజన్మించెను
పొగదాగనివాడు దున్నపోతులకొడుకౌ.

క. రంజన యోగులకొసగును
కంజజముఖవినుతిగాంచు గాంజాయారా
యంజనసుతుడదది తెలియక
సంజీవిని దెచ్చియిచ్చె సౌమిత్రికహో!

సీ. ధరణీసురులకెల్ల గురిగింజ మాధవుం
డిడినక్ష్యమనికరం బెత్తిచూపె
ఈధూమ్రవృక్షంబు ఇలగలదంచును
శేషాచలేందు్రిందు చేయిచూపె

ఈధూమ్రపత్రంబు ఇంతింతయనుమాడ్కి
వినతాసుతుఁడుచేతు లెనయఁజూపె
ఈనశ్యమావృక్షమింతింత యనుమాడ్కి
అలజగన్నాథుండు కటినిజూపె

ఆ॥ నశ్యమేయునట్టి నరులసుబోడగాంచి
నిందజేయునట్టి నీచజనుల
శిరమువ్రక్కలుగను సేయుదుననుచును
చిరుతయనిలసుతుఁడు చేయిజూపె.

పూర్వము బ్రహ్మదేవునకు పడిసెము (జలుబు) పట్టియుండెనట, అతఁడాపడిసెమును పొగబీల్చుటచే నివారించుకొనెనఁట.—ఒకానొకప్పుడు దేవేంద్రాదులు, బ్రహ్మదేవుని గుఱించి భూలోకమున సారభూతమయిన పదార్థమెద్ది? యని యడుగగా నందులకతండు;

పురాపృష్టవా నబ్జయోనిం బిడౌజా
ధరిత్రీతలేసారభూతమ్‌కిమస్తి
చతుర్భిర్ముఖైరుత్తరంతేనదత్తం
తమాలంతమాలం తమాలంతమాలం॥

పొగాకు, తంమాకు, హొగేసొ, పొగెలై అని నాలుగు మోములతో నాలుగు విధములుగా నుచ్చరించెనట.

కంచివరదరాజులు నారదులకు నశ్యమిచ్చిరఁట.

క. నశ్యమేయువాడు నరలోకపూజ్యుండు
నశ్యమేయనతడు నత్తవెధవ
వేసివిడుచువాడు వెరిపతాఃకొడుకయా
విశ్వదాభిరామ వినరవేమ.

ఇట్టిదురాలాపములెన్నియో కలవు. జనులారా జాగ్రత; జాగ్రత; ఈదుర్వాదుకలకు లోబడకుఁడు

## అబద్ధపుకథలు.

పామరజనులను మోసపుచ్చుటకై మాంసభక్షక పిశాచములచే ఎన్నియోకట్టుకథలు కల్పింపఁబడియున్నవి. అందొకటినిమాత్రి మిచ్చట వ్రాసెదను.

ఒకానొక గ్రామమున స్వర్ణకేతువనెడి గృహస్థుఁడుండెనట. అతఁడు మిక్కిలియైశ్వర్యవంతుఁడు. ఒకనాఁడు కసాయివాఁడొకఁడు బక్కగోవులనుకొన్నిఁటిని వెలకుఁగొని తీసికొని పోవుచుండెను. గృహస్థుఁడాగోవులయెడ జాలిగలవాఁడై వానినా కసాయివానికి లాభమిచ్చికొని తనపొలములలో మేపుచుండెను. ఒకనాటిరాత్రి యాతని స్వప్నములో గోవులు భయంకరాకారముతోవచ్చి ఓరీ, నిర్భాగ్యుఁడా, మమ్ముల నేలకొంటివిరా ! ఆకసాయివానిచేఁ జంపఁబడి మామాపాపములఁ దీర్చుకొని మంచిజన్మములకుఁబోయి [illegible]ందుముగదరా ? తోడనేవిడిచిపెట్టుము. లేని[illegible] నిన్నేమిచేసెదమో చూడుమని బెదరించినవట. గృహస్థుభయపడి రెండవనాఁడే వానిని విడిచిపెట్టెనఁట. ఇట్టి యబద్ధపుకథ లెన్నియోకలవు.

## శ్రాద్ధములలో మాంసము వండితినవలెనా ?

విష్ణుపురాణాది కొన్నిగ్రంథములయందు, పితృలకు శ్రాద్ధముచేయుటలో మాంసముతోచేసెడి శ్రాద్ధము మంచిదని విరివిగా వర్ణింపఁబడియున్నది. వేదమునందీవిచారము చెప్పఁబడలేదు. ఇది కుత్సితజనులచేఁ గావింపఁబడిన ప్రక్షిప్తవాక్యముగా నుండవచ్చును.

అశ్వాలభంగవాలంభంసన్యాసంవలపైతృకం
దేవరాచ్చసుతోత్పత్తిం కలౌ పంచవివర్జయేత్

(పరాశర ధర్మశాస్త్రము.)

దీనిచే కలియుగమున మాంసశ్రాద్ధము నిషేధింపఁబడియున్నది. మరియు,

కుర్యాదహరహః శ్రాద్ధమ్ అన్నాద్యేనోదకేనచ
పయోమూలఫలైర్వాపిపితృభ్యః ప్రీతిమావహన్.

(మనుస్మృతి -౩-వ అధ్యా)

అన్నముతోఁగాని, జలముతోఁగాని, పాలతోఁగాని, కందమూలఫలాదులతోఁగాని, శ్రాద్ధము చేయవలయును. అందుచే పితృవులు ప్రీతిఁజెందుదురని తాత్పర్యము. జ్ఞానులెవరును మాంసభక్షణమున కొప్పియుండలేదు.

ఇప్పుడు మాంసము తినకవిడిచినను వెనుకతిన్న
దోషమెక్కడికిబోయె.

జ్ఞానుల బోధవినుటచే కొందరుమాంసభక్షణమును వర్జింతురు. వితండవాదులగు దురాచారులు వారితో దుర్వివాదమున కుపక్రమించి ఇప్పుడు మాంసము తినకపోయిన మాత్రానఫలమేమి? వెనుక తిని ఎముకలు బలిసియున్న దెక్కడకుఁబోయెనని చిక్కులుబెట్టుదురు, ఇది మిక్కిలి దురభిప్రాయము.

కృత్వాపాపంహిసంతప్య తస్మాత్ పాపాత్ ప్రముచ్యతే
నైవంకుర్యాత్ పునరితి నివృత్యాపూయతేతుసః

(మనుస్మృతి)

ఒకడు పాపకార్యము చేసియున్నను. (హెచ్చరికజెంది) ఇకమీద నేనిట్టి పాపకార్యములు చేయుటలేదు. అని నిశ్చయించుకొని చేయకయుండెనేని అంతకు ముందాతఁడు చేసినపాపములు పరిహారమగునని తాత్పర్యము. పశ్చాత్తాపపడినది మొదలు హెచ్చరికగానున్నచో వెనుకటిపాపములునశించి పోవునని జ్ఞానులనేకులు వచించినారు.

గూఢార్థవాక్యములు.

ఆ॥ కుక్కనుదినువాడు గురులింగజంగంబు
పందినితినువాడు పరమయోగి

ఏనుగదినువాఁడు ఎంతసుజ్ఞానియో
విశ్వదాభిరామ వినర వేమ.

దీనికనేకులు అపార్థములుకల్పించి, కుక్కనుకోసి తినువాఁడు గురులింగజంగమనియు పందినితినువాఁడు యోగియనియు ఏనుగుదినువాఁడుజ్ఞానియనియు పామరులకు బోధించి వారిచేమాంసభక్షణము చేయించి పాపము చేయుచున్నారు. ఇదిమిక్కిలి నీచకార్యము. కుక్కయనఁగా తనయందుఁగలకోపము పందియనఁగా మూర్ఖత్వము, ఏనుఁగనఁగా మదము ఈకోపమును, మూర్ఖతను, మదమును, (తినుట) అనఁగా నశింపఁజేసికొనుటచే మోక్షముసిద్ధించునని యభిప్రాయము. అంతేకాని కుక్క మొదలగువాని మాంసము తినవలెనని కాదు. ఇట్టిగూఢార్థములెన్నియో కలవు జనులారా! జాగ్రత జాగ్రత !!

ఆవుపాలు రక్తము కాదా.

ఆవుపాలు త్రాగవచ్చునా అది రక్తము కాదాయని కొందఱు పలుమారు వాదించుటగలదు; ఆవుపాలు రక్తము కాజాలదు, బురదలో తామరపువ్వు బుట్టుచున్నది, పువ్వును శిరంబునధరింతురే కాని బురదను తలకు బూసికొనరు, పద్మమునకు జన్మస్థానమైన పంకమునసహ్యపదార్థమే కాని పద్మమసహ్యమైనది కాదు, అట్లే గోక్షీరమును పానము చేయవచ్చునే కాని దాని రక్తమాంసములఁదిన రాదు. తల్లిచంటిలో పిల్లలకు పాలువచ్చునుగదా? ఆచంటినే కోసిఏలతినిపింప రాదు. అదియెట్లు తినిపించుటలేదో, పాపకరమౌ గోమాంసమును అట్లే తిన రాదు. పాలుత్రాగవచ్చును. తల్లిచంటిని గోసి యామాంసముపిల్లలకిచ్చుటధర్మమా? అది విశ్వాసఘాతుకము గాదా? మాంసభక్షణము చేయువారు జంతువులను వధింతురే కాని. క్షీరపానము జేయువారు జంతుహింస చేయనక్కరలేదు. గోవుల నెంత చక్కఁగాపోషించిన నంత సంతోషముతోనవి పాలిచ్చును. గొప్పశాస్త్రవేత్తలీయర్థమునే బోధించుచున్నారు.

అమెరికాలో వందలకొలఁది, ఆవులుగల యొక కాపువాఁడుదయమును రాత్రివేళను పాలు పితుకునప్పుడు వాద్యనియమముగాని బ్యాండును

గాని తెప్పించి మనోహరమైన కీర్తనలను పాడించుచునట. ఈ సంగీతమువలన గలిగిన ఆనందముచేత ఆవులు మునుపిచ్చుచుండిన పాలకంటె వంతు (మూపాయలో 0-5-4) లు ఎక్కువపాలిచ్చుచున్నవి. (అం)

## ధాన్యములలో ప్రాణము లేదా?

దురాచారములనుండి తొలంగుట కిష్టములేక కొందరు ధాన్యములు, శాకములు, సయితము ప్రాణవంతములేయనియు వానిని తినుట సయితము పాప హేతుకము కాదాయనియు, వితండవాదము చేయుచున్నారు. ధాన్య, శాకములయందు ప్రాణివధ యేమాత్రమును గానరాదు. ధాన్యము నొక పాత్రయందు నైచి యేండ్లకొలది మూసిబెట్టియుండినను నవి చెడవు. శాకములు సయితము కొంతకాలమువరకును చెడవు; మాంసమునకై వధించెడి జంతువులవట్లు గోతులలో పాతిబెట్టినం బ్రతుకగలవా? కావుననే ధాన్యాదులు నిర్జీవశాఖలో జేరినవని పెద్దలు నిర్ధరించి సాత్వికాహారవర్గములో జేర్చిరి- భాగవత ఏకాదశస్కంధములో చెట్లుచేమలునిర్జీవవస్తువులని చెప్పఁబడియున్నవి.

## మేకలు గొఱ్ఱెలు మొదలగున వెందుకు బుట్టినవి.

జంతుహింసచేయరాదని బోధింపఁగా కొందఱు గొఱ్ఱెలు, మేకలు మొదలగున వెందుకుబుట్టినవని వాదింపనారంభించిరి. గొఱ్ఱెలు మేకలు మొదలగునవి, వ్యవసాయదారులకు ఎరువు కొఱకును, కంబళ్ళు మొదలగు వాని కుపకరించెడి (బండను) ఉన్నికొఱకును సృజింపఁబడినవి. చేపలు మొదలగునవి, నీళ్ళయందలి అశుద్ధములను పరిహరించుటకై సృజింపఁబడినవి. పక్షులు, శవములు మొదలగువానిచే కలుగు అశుద్ధములను నివారించుటకై బుట్టినవి. కోళ్ళు, మానవులకు కాలము తెలుపుటకును, హెచ్చరించుటకును, ఊళ్ళయందలి అపరిశుద్ధములను నివారించుటకును నిర్మింపఁబడినవి. ఇట్లే తక్కిన పశుపక్షి మృగాదులన్నిటి సృష్టికిని కారణమున్నది. తక్కిన వివరములు సుజ్ఞానచంద్రోదయ మను గ్రంథమునఁ దెలిసికొనవలెను.

## { మాంసాహారము; భా ర త వ చ న ము లు }

వేదాదిశాస్త్రములయందు మాంసాహారము బొత్తిగా దుర్వ్యాడుక యని విధింపబడియున్నది, భారతమునందు మాంసాహారము చేయవచ్చునను నభిప్రాయమిచ్చునట్టి కొన్ని వాక్యములును చేయరాదని యనేక వాక్యములునుఁ గానవచ్చుచున్నవి. కర్ణుని జననమును గురించి యతఁడు సద్యోగర్భ సద్యః ప్రసవజాతుండని. ఆదిపర్వమునందును, నవమాసానంతరమునఁబుట్టినవాడని, యారణ్యపర్వమునందును నెట్లు ప్రక్షిప్తపఱుపఁబడినదో, అట్లే మాంసాహార మండనవాక్యములునుఁ బ్రక్షిప్తము చేయఁబడియున్నవి. ఇట్లే రామలక్ష్మణాదులు మాంసభోజనులని రామాయణాదులయందును కుకల్పనలు గావింపఁబడియున్నవి.

### మాంసాహార మండనవాక్యములు.

కం॥ ఫలమూలౌషధిశాకం
బులు పశుమృగతతులు భక్ష్యములుగా భూతం
బుల కజుఁడు సేసెనని య
స్ఖలితంబుగ మ్రోయుశ్రుతులు, గాదనవశమే.

కం॥ పనివడి యహింసవ్రతముగఁ
గొని వనమున నున్నమానులకుం దొడరదె హిం
సనము తరుమూలఫలశా
క నిపీడనమదియు హింసగాదొకొ తలపన్.

కం॥ పితృకార్య యజ్ఞముఖముల
శ్రుతిచోదితహింసకేను సొరనేరదు వి

శ్రుతిగుణమాంసము చవిగొ
ని తినంబ్రాణిఁదెగటార్చు క్రియ బాపమగున్,

(భారత-అనుశాసనిక)

శ్రుతిచోదిత మనగా వేదమందు చెప్పఁబడిన యజ్ఞయాగాదులయందు జీవహింస చేయవచ్చునని దీనివలన దేటపడుచున్నది. వేదము జీవహింసను బొత్తిగా నిషేధించుచున్నదనుట నీగ్రంథమునందే వేరొకచోట వ్రాయఁబడియున్నది.

మాంసాహారఖండన వాక్యములు.

శ్రీమహాభారతానుశాసనికపర్వము — భీష్మయుధిష్ఠిర సంవాదము.

ధర్మరాజు: — భీష్మపితామహా? మాంసంబు పితృదేవతలకుఁ బ్రియంబు శ్రాద్ధంబు మాంసముఖ్యంబుగా నడపవలయునని చెప్పుదురు. వధింపక మాంసంబెట్లుకలుగును?

భీష్మాచార్యుడు: — ధర్మనందనా?

గీ॥ వాజిమేధంబు కంటెను బూజనీయ
కర్మమందురు మాంసభక్షణము విడుపు
వినుము చంపుటయును చంపబనుచుటయును
కల్మషంబులకెల్ల నగ్గలము లధిప.

"వినుమాంసముఁ గోరునరుఁడు దనుజుడచూవె॥"

కం॥ శతవర్ష దుష్కరతపః
కృతినంజుడుదినమి* నగుసుకృతమివిరెండున్
మతిదలప నొక్కరూపని
శ్రుతివేదులు చెప్పుదురు కురుక్షితినాథా.

---

* నంజుడుదినమి — అనగా మాంసముఁ దినకుండుట.

సూర్యేంద్రు ఘోరతపంబాచరించుటచే నెంతఫలము కలుగునో ఆఫల మొక్క మాంసాహారమును విడుచుటచే కలుగునని తాత్పర్యము.

గీ॥ అన్యమాంసమున నిజాంగమాంసంబు బో
షింతుననుటకంటె చేటులేదు
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలులేదు కర్మజాలకమున.

క॥ భూతముల కలుగునతనికి
భూతముల ఖిలములు నలుగు భూతహితార్థి
భూతతతి కభయమిచ్చిన
పూతాత్మునకభయమిచ్చు భూతావళియున్.

జనులారా ! భూతములను హింసింపకుఁడు. కరుణాళువులై మెలంగుడు.

{ మహమ్మదీయుల గ్రంథములుఁగూడ మాంసాహారము వద్దనుచున్నవి. }

1. కొరాను, 2 అధ్యాయము (సేలు) లో చెప్పఁబడినది:—సామగ్రి సమకూర్చుకొనుము. ఆత్మశుద్ధి యందుల కుత్తమమైన పరికరము. ఓ బుద్ధిమంతులారా ! నా యెడల భయముగలిగి యుండుఁ (ప్రియాణవిహారము)

2. అబ్దుల్లామసూద్, అను సాధువీలాగానతిచ్చి యున్నాఁడు.

వలువదిగోవులనుఁ జంపినవాడొక ఖూనీచేసిన వాడగుచున్నాఁడు. తన సౌఖ్యమునకై ఏజంతువునుఁగానిఁ జంపునట్టి దురాత్ముడు దేవుని నివాసమగు "కాబా" ను నాశపఱచిన వాడగును.

3. మహమ్మద్ మతస్థుడైన "ఆలీ" అనునతఁడు ఇజారిహాక్ అను గ్రంధమునం దిట్లాజ్ఞాపించినాడు.

„మీ దేవుఁడు ప్రజలలోని మాంసమునుఁగాని పశువుల రక్తమునుఁ గాని ఒల్లడు, అతఁడు మీపవిత్రతను మాత్రమే కోరును. కావున మీపావనమైన మరియు గారుణ్యరసపూరితమైన హృదయక్షేత్రములను రక్షకులను భావముతో మిమ్ములను నెఱనమ్మికొని సర్వకాలము మీకు అమృతప్రదానము చేయుచు, మీకు ఏవిధహింసయుఁజేయక మీకుటుంబరక్షకనిధులై చెలంగుచుఁడు ఏమీ తెలియని మూగజంతువుల అనాథశరీరములకు గోరీలుగా చేసికొనకండి.„

చూచితిరా! మహమ్మదీయులైనంత నే గోవధ చేయవలెనను విధి కిఁమియయు లేదు,

## బైబిల్, మాంసాహారమును నిషేధించుచున్నది.

(Mat) మ్యాట్ (VI—9—11)......నాకు ప్రతిదినమూ రొట్టె నిమ్ము.

(Romans) (XIV) రోమన్స్. ఏసుక్రీస్తు ఎవరికొఱకు గతించెనో వానిని నీభోజనమునకైఁ జంపకుము:

(17) స్వర్గప్రాప్తికొఱకు మాంసభక్షణము సురాపానము అవశ్యము లేదు. అయిన, శాంతి, సంతోషము, శమము, ఇవి అవశ్యకములైనవి.

(20) మాంసమునకై దైవసృష్టిని చెఱుపకుము

(21) మాంసభక్షణమయినను, సురాపానమైనను, (లేక) నీసహచరులగు ఇతరప్రాణులను హింసించినదైనను, బలహీనపఱచినదైనను, అథవా క్షీణించునట్లు చేసినఁగాని నీకెన్నటికిని శ్రేయస్సాధనకాఁజాలదు.

## బైరనుదొరగారి యనుభవము.

మాంసాహారము కొంచెమైనను గొప్పయైనను ఎట్టి శాంతచిత్తునకైన తామసగుణము గలిగింపకమానదు. ఒక ఎలుగుబంటిని బోనులోబెట్టి దానిర

రొట్టెలు పెట్టినన్ని రోజులది నెమ్మదిగనుండెను. దానికి మాంసాహారమిడినది మొదలది లొంగక అల్లరిచేయ నారంభించినది. మరల దానికి స్వాత్వికాహారమిడినది మొదలు క్రమక్రమముగ సాధుభావము దానికి వచ్చినది. కాన మాంసాహార మెంతమాత్రమును పనికిరాదని లయిబెగుగారును షైరనుగారును నుడివిరి.

(12-11-18 సువర్ణలేఖ).

"To what purpose is the multitude of your socrifices unto me, saith the Lord....................I delight not in the blood of bullocks, or of lambs, or of he-goats."

(Isaiah I—II—I4)

ఎందుకీ యసంఖ్యాత యాగములు నాకొఱకు? (చేసెదరు). పశువులయు, గొఱ్ఱెలయు, మేకలయు, రక్తముచే నాకు సంతోషము కలుగదు. (అని దేవుడు చెప్పెను).

(బైబిల్ ఇసయ, 1-11-14).

"And God said, Behold, I have given you ewery herb bearing seed which is upon the face of the earth. And every tree in which the fruit of a tree yeilding seed. To you it shall be for meat."

(Divine authority).

మరియు దేవుడానతిచ్చెను. ఏమన (ఓజనులారా) జ్ఞప్తియుంచుకొనుడు; మీకు నేనన్నివిధములైన గడ్డిదినుసులను, చెట్లను, విత్తనములను, పండ్లను ఇచ్చియున్నాను. అదియే మాంసమునకు బదులుగా నుండగలదు).

{విదేశములలో మాంసాహార నిషేధసంఘములు వాని శ్లాఘ్యతలు}

అనాదికాలమునుండి అహింసాధర్మమునకు పేరుగాంచిన మనదేశములో ఇప్పుడు రానురాను మాంసాహార దురాచారము ప్రబలుచున్నను వేలకొలది ఏండ్లనుండి మద్యమాంసములయందే మునింగి తేలుచుండిన యూరపుయున్నగు ఖండాంతరములలో నిప్పుడు, అహింసాధర్మము చక్కగా

స్థాపింపఁబడుచున్నది. మిక్కిలి చురుకుగా పనిచేయుచున్నది. వారినిచూచి యైన హైందవులు మాంసమును విసర్జింతురుఁగాక.

Says Mr. Amos, Secretary, The Negetarian Societ y Manchester.

There have sorung up in 10 years in the United Kingdom over 100 Vegetarian hotels, restaurants, boarding houses ; about 100 shops of Veg food stuffs ; 14 periodicals, and 2000 shops of Veg ghee (nut butter). Vegetarianism counts among its advocates such great men as Count Tolstoy, General Booth, Sir Isaac Pitman, Mr. Edison Dr. Peebles, M. D.

(Harbinger, 14-2-1913)

మ్యాంచెస్టరు శాకాహారసంఘకార్యదర్శి శ్రీ, ఆమస్ దొరగారిట్లు వ్రాయుచున్నారు:—అరువదిఏండ్ల కాలములోపల సంయుక్తరాష్ట్రములయందు పరిశుద్ధశాకాహార సంబంధమగు (100) నూరు, హోటలులును, ఫలాహారశాలలును, అనాధశరణాలయములును, శాకాహార పదార్థములను విక్రయించెడినూరు దుకాణములును, పదునాల్గు వార్తాపత్రికలును, విత్తులనుండి తీసినవెన్నతో తయారుచేసిన నేతిని విక్రయించెడి రెండువేల షాపులును స్థాపింపఁబడినవి సుప్రసిద్ధులైన, కౌంట్ టాల్‌స్టాయ్, జనరల్ బూత్. సర్ ఇసాక్ పిట్మన్, మిస్టర్ ఎడిసన్, డాక్టర్, పీబల్స్, యం. డి. మొదలగు వారిచే శాకాహారపద్ధతి వన్నెకెక్కుచున్నదని ఆమస్ దొరగారు వ్రాయుచున్నారు. చూచితిరా, విదేశములందు శాకాహారప్రయత్నములు.

"I date my freedom from almost chronic rheumatism to the day when I stopped eating beef," said Depew, "and sleep. digestion and clarified vision, such as I had never known before, have kept increasing as I dismissed flesh and fowl for vegetables "—The new York Press (The Vegetarian Messenger, February, 1911.)

న్యూయార్కు పెస్ఫ్. శాకాహారవర్తమాని, డిప్యూగారియనుభవము నిట్లు ప్రకటించినది.

నేను మాంసాహారమును బొత్తిగా విడిచిపెట్టుటచే, దీర్ఘకాలము నుండినన్ను బాధించుచుండిన, వాతరోగము నిర్మూలించినది. నేనెన్నడును అనుభవించి యెఱుఁగని, సుఖనిద్ర, జీర్ణశక్తి, నిర్మలదృష్టి, మున్నగువానిననుభవించుచున్నాను.

(High opinions of the Western Gentlemen)

(1) Flesh food is unnatural for man To eat the ffesh of murdered animals is therefore contrary to our creator's intention and will.

(2) Flesh food is unnecessary. Half the human race do not donsume it, many of the strongest nations have abstained from it.

(4) Thrse fourths of our povarty and crime are the consequences of intemperance.

(5) Carnal diet, tends to make men and other creatures that are fed upon it pugnacious, quarrel-some, and bloodthirsty where as non-carnivorous nations, have been noted for their peaceable disposition.

(6) The consumption of ffesh blood necessitates, the infiiction of an appaling amount of pain and cruelty and death by violence in its most brutal forms (unmitigated by pity, consideration or mercy) upon at least a million large animals every day in what are called Christian countries. ,

SIDENY H. BEARD,

Temperrance Society (London)

(ముఖ్యతాత్పర్యము)

1. మాంసాహారము మానవున కస్వాభావికము. వధింపబడిన జంతువుల మాంసమును దినుట "సృష్టికర్త" యుద్దేశమునకును ఇష్టమునకును విరోధమైన కార్యము.

2. మాంసాహార మనావశ్యకము. మానవ సంతతియం దర్ధభాగము మాంసమును దినుటలేదు. బలిష్ఠులైన యనేక జాతులవారు దీనినుండి తొలంగియున్నారు.

4. మన దారిద్ర్యము అపవిత్రితలనునవి మాంసమును విడువకుండు దాని ఫలమే యగును.

6. మాంసాహారులగు మానవులు మరి యితరజంతువులు మొరటుతనము గలవారుగను, కలహప్రియులుగను రక్తమునుద్రావు నిచ్ఛగలవారుగను నుందురు. అమాంసాహారులగు (జనాంగము) వారు శాంత స్వభావము కలవారని ప్రసిద్ధిఁజెందియున్నారు.

7. మాంసమును రక్తమును పుచ్చుకొనుటవలన దయాదాక్షిణ్యములు నశించి కరుణ, యోచన, పశ్చాత్తాపములు ఇనుమంతయును లేక క్రైస్తవరాజ్యములయందు అనుదినమును పదిలక్షల (సంఖ్యగల) జంతువులను మృగస్వభావముతో జంపుటకుఁ గారణముగా నున్నది.

సిడ్నే హెచ్. బర్డు,

మద్యమాంసనిషేధ సంఘము, లండన్.

It is good neither to eat flesh nor to drink wine.

మాంసముదినక సారాయము పుచ్చుకొనకయుండుట మంచిది.

The practic of flesh-eating is demonstrated to be a totally unnecessary habit.

మాంసభక్షణము బొత్తిగా అనావశ్యకమైన అభ్యాసమని నిశ్చయింపబడినది.

Wherefore I will eat no flesh so long as the world endureth.

ప్రపంచమంతయుండువఱకును నేను మాంసమును భక్షింపను.

HARRY COCKING.

హ్యారి కాకింగు.

మాంసాదులను వదలివేయుటవలన రోగములు సహితము త్వరగా కుదురును.

The patients themselves quickly recognized that they are better without flesh meat since it acts as a stimnlant* and they want none.

Temperance Association,
(Food Reform Department)

I am quit sure it is going to be a wonderful help in saving the poor drankards.

(Captain Helen Hudson)

The natural food of man judging from his structure appears to consist principally of the fruits, roots, and other succulent part of vegetables.

మనుజుల స్వాభావికాహార మేదియని విమర్శించగా పండ్లు, వేర్లు (గడ్డదినుసులు) ఇతరశాఖ సంబంధపదార్థములు అని తోచుచున్నది.

Professor Baoon Cuvior.

ప్రొఫెసర్ బ్యారన్ కూవియర్.

Meat is absolutely unnecessary for a perfectly healthy existence and the best work can be done on a vegetarian diet.

నిర్మలారోగ్యముగానుండుటకు మాంసము బొత్తిగా అనావశ్యకము. శాకాహారము దానికంటె మేలుగానుండును.

Professor G. Sims Woodhead.
M. D., F. R. C. P., F. R. S.

ప్రొఫెసర్ సిమ్సు ఉడ్ హెడ్.

(Extracts from Sir William Earnshaw, Cooper's The Toiler and his food and other leaflets.)

మహౌషధము.

ఇంగ్లాండులో నొకడు పది నిమిషములలో 13 సగము సారాయి బుడ్లను త్రాగుటకు పందెమును వేసెను. ఏడు నిమిషములలో సారాయినంతను త్రాగి పందెమును గెలిచెను కాని తెల్లవారు సరికి చచ్చిపడియుండెను.

గోహాన్సు, హాస్సెణ్ఘర్, గునూరు అను జిల్లాలలో కొందరు మహామ్మదీయులును కటికవాండ్రును గోవధ చేయకుండుట కంగీకరించి ప్రమాణపత్రిక వ్రాసియిచ్చిరి. సువర్ణలేఖ 1-9-1913)

జంతుహత్య నివారించుటకై కొందరు విదేశీయు లెంతయో ప్రయత్నము చేయుచున్నారు. రెవరెండ్, ఏ. ఎమ్. మిచల్. ఎం. ఏ. అనువారు జీవహింస మిక్కిలి క్రూరమైనదనియు, సిగ్గులచేటనియు వ్రాసియున్నారు.

How sweetly sings Shelly that premier poet of England!

My brethren, we are free! The fruits are glowing
Beneath the stars, and the night-winds are flowing
O'er the ripe corn. The brids & beasts are dearming.
Never again may blood of bird or beast.
Stain with its venous stream a human feast.

ధాన్యములు, పండ్లు కావలసినట్లుండగా (వానినివిడిచి) మాంసమును మనుష్యులెవరును భుజింపరాదని షెల్లీ యను సుప్రసిద్ధాంగ్లేయకవి పాడియున్నారు.

## హెచ్చరిక.

......that a noble-hearted English lady, the Hon. Mrs. Charlton, has very kindly resolued to try to stop all kinds of cruelty to animals in India. I therefore pray that your humanitarian readers may kindly write to her (c/o the Secretary of the Royal Society for the Prevention of Cruelty o Animals, 105, Jermyn Street, London, S. W.), telling her tof any cases of cruelty to animals that may come to their knowledge, and sending by press cutting on the subject.

Harbinger, 1-21913.

లండన్ S. W. జర్మియన్ వీధి, నెం. 105 ఇంటిగల దయావంతు రాలగు గౌరవనీయ మిస్ట్రిస్ చార్లట్, అను నారీమణి హిందూదేశపుజీవ జంతువుల హత్యకు సంబంధించిన దుర్దశను తొలగించుటకై పూనియుండుట వలన ఇండియాలో జరిగెడి జంతుహింసలను గురించి దయాళువు లామెకు తెలుపవలెను

Do you love your fellowmen? Where go to seek for Gods? Are not all the poor, the miserable, the weak, Gods? Why not worship them first? Why go to dig a well on the shore of the Ganges?

## జీవహింస చేయనివారెవరు?

దురాచారమునంబడి దొప్పదోగుచుండువారికి హితబోధలొనరించి నను వినరు. వీరిలో రెండుతెగలవారుకలరు. అజ్ఞులు—వితండవాదులు.

అజ్ఞస్సుఖమారాధ్య స్సుఖతరమారాధ్యతే విశేషజ్ఞః
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపినరం నరంజయతి॥

అను సుభాషితము చొప్పున, అజ్ఞుడు (తెలియనివాడు) ఇట్టివానికి హితోపదేశము చేసినయెడల వాడదినమ్మియదివరకు చేయుచుండిన, దుర్వ్యా డుకలను విడనాడును. విశేషజ్ఞునకు ఒకరలుచెప్పవలసిన యవసరమేయుం డదు. చిలుకవలె కొంతకొంత తెలిసికొనియుండు మూర్ఖునకుఁ దెలుప బ్రహ్మదేవునికిని సాధ్యముకాదని తాత్పర్యము.

## వితండవాదులు.

ఇట్టివారికి, అహింసాధర్మముఁ బోధించినచో నీలాగున ప్రశ్నవైచు చుందురు.

(1) హింసచేయనివారెవరు.

(2) తోపనవదమునప్పుడు హింసయగుటలేదా.

(3) నేలదున్నపుడును. విసరునపుడును. దంచునపుడును, మరియు నేకవేళలందును జీవహింసజరుగదా.

(4) పొయ్యిమండునపుడు, గాలిని పీల్చునపుడు, నీరుత్రావునపుడు జీవహింసలు జరుగవా.

మాంస భక్షణము చేయుటయందుమాత్రమే అధికమైనహింసయేమి.

ఇత్యాదిగా నీవితండవాదుల ప్రశ్నలు.

ఇందుకు సమాధానము వేర్వేరుగా నీక్రిందవ్రాయఁబడుచున్నది.

## జీవహింసా స్వరూపము.

జీవహింసయనగా, జీవజంతువులను బాధించుటలేక చంపుట. ఇది సాహంకారకృతము. నిరహంకారకృతము, అనిరెండు విధములు. మనుష్యులు భూమిమీద సంచరించునప్పుడును. నేలదున్నునపుడును, పొయ్యిమంట చేయునపుడును, పిండివిసరునప్పుడును, ధాన్యముదంచునపుడును, గాలిని పీల్చునపుడును, నీరుత్రాగునపుడును, కంటికగుపడని సూక్ష్మజంతువులు కొన్ని హింసింపఁబడుచున్నవి. ఇదిబుద్ధిపూర్వకముగా గర్వముచేత చేసినది కాదు, అనివార్యముగా సంభవించునవి. కండ్లతోఁజూచి కావలెనని అహంకారముతో జంపినదికాదు, ఎంతప్రయత్నించినను తప్పిపోవునదికాదు కావునఈవిచారములందు అగోచరముగా కలిగెడి జీవహింసలు దైవాధీనములనియు అవిపాపములు కావనియు పెద్దలు వచింతురు.

## మహనీయులెవరును జీవహింసచేయలేదు.

(పూర్వమున)

ఆర్యులగు రాజర్షి బ్రహ్మర్షులును, శ్రీశంకర రామానుజమధ్వాచార్య ప్రభృతులును, జయదేవ జ్ఞానదేవప్రభృతులును,

ఇటీవల

శ్రీరామకృష్ణ పరమహంస. స్వామిదయానంద, వివేకానంద, గోకులే గురుదత్త, శివానంద ప్రభృతులును, జీవహింస చేసియుండలేదు.

ఆంగ్లేయులలో

(ఇప్పటివఱకు)

మిల్టన్, తామ్సన్, బ్యారన్‌కూవియర్, బర్న్సు, మిచల్, కూపర్, శాకింగ్, సిమ్సుఉడ్ మున్నగువారును,

విసర్జించినవారు.

అనిబిసెంట్, అల్కాట్ నివేదిత బ్రూక్సు మున్నగువారును,

మహమ్మదీయులలో.

కబీరు మున్నగువారును*

ఫ్రెంచివారిలో.

రసూ్య మున్నగువారును,

ఇటాలియనులలో.

గసండి, జూలియన్ మున్నగువారును.

గ్రీకులలో.

ప్లేటో శెనిక్, ప్లూటార్కు మున్నగువారును,

సిక్కులలో.

నానక్ ప్రభృతులును. (వీరందరు) మాంసాహారమును నిషేధించియున్నారు.

కం॥ శతవర్షా దుష్కరతపః
కృతి మాంసము దినమి నగు సుకృతమివి రెండుం
మతిదలప నొక్కరూపని
స్మృతివేత్తలు చెప్పుదురు కురుక్షితినాథా.

(భారతము అనుశాసనికపర్వము.)

*ఈమధ్య కాబూల్ అమీరుగారు హిందూదేశమునకు వచ్చియుండి ఇప్పుడు మహమ్మదీయులవిందులో గోమాంసాహారము పుచ్చుకొనలేదు.

నూరు వత్సరములు గ్రమముగా తపస్సు చేయుటకు గలిగెడి ఫలము మాంసాహారము విడుచుటతో సమానమని భీష్ములు ధర్మరాజున కెఱింగించి యున్నారు.

{ జీవహింసాది పాపములకుఁ
ప్రాయశ్చిత్తముకలదా. }

కండ్లకు గనుబడక అగోచరముగాఁ జరిగెడికర్మములకుఁ గొంతవఱకు నివృత్తి కలుగునను నమ్మకము కలదు గావున వట్టివానికి ప్రాయశ్చిత్తము కలదు.

పంచసూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్కరః
కండనీచోద కుంభశ్చ బధ్యతేయాస్తువాహయన్
తాసాంక్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థంమాహర్షిభిః
పంచక్లృప్తామహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినామ్॥

(మనుస్మృతి

గృహస్థులగు వారియిండ్లలో ఐదువధస్థానములు కలవు. ఏవన, పొయ్యి, రోలు, చీపురు ఉదకుంభము, సన్నెకల్లు మొదలగునవి. వీనిద్వారా, సూక్ష్మజంతువులు కొన్ని హింసింపఁబడుచున్నవి, కావున తద్దోషనివారణార్థమై గృహమేధియగువాడు, ప్రతిదినమును, బ్రహ్మయజ్ఞ, దేవయజ్ఞ, పితృయజ్ఞ, మనుష్యయజ్ఞ, భూతయజ్ఞములను పంచయజ్ఞము లాచరింపవలెనని విధింపఁబడియున్నది, ఇఁక కడుఘోరకూటికై తెలిసి తెలిసి చేయు పాపములకు ప్రాయశ్చిత్తమెక్కడిది? నరకానుభవమే దానికి ప్రాయశ్చిత్తము. పార్వతి పరమేశ్వరునితోనిట్లు ప్రశ్న చేయగా నందులకుఁ బరమేశ్వరుఁడు.

ఆ॥ అతివ కామ కృతములైన కర్మంబుల
ఫలము లనుభవింపవలయు వినుమ

కామకృతము చెడుటకలుగు ప్రాయశ్చిత్త
మాచరింప సంశయంబువలదు.

(భాగతము ఆనుశా.)

తెలియక చేసిన పాపములకు ప్రాయశ్చిత్తముకలదేకాని తెలిసి తెలిసి యొక్రైదుట చేసెడి పాపములకు ప్రాయశ్చిత్తములేదు. ఇచ్చట తెలియక చేసిన పాపమనగా :మనకంటికిఁ గాన్పించక తనంత సంభవించువట్టి పాపము. అంతేకాని మాకా పాపపుణ్యములే తెలియవని మాంసాహారులు చెప్పెడి మాట సర్వాబద్ధము. అదిపాపమనుట నిర్వివాదాంశము.

ధర్మవ్యాధుఁడు.

భారతమునం దుదాహరింపబడియుండు ధర్మవ్యాధునికథ మాంస భక్షకులకు పరమాధారము. ఈసమస్తప్రపంచమును జంతుమయమైయుండఁగా జంతుహింస చేయమని సాహసింపఁ గలవారెవరు? మాటిమాటికిని హింసకలుగుచు నేయుండును.

గీ॥ హింస సేయనివాడులే డిజ్జగమున
నొక్కఁడైనను దమతమ యోపినట్లు
హింస తెరువున కెడ గల్గియేగవలయు
నడియచూవె యహింసనా నతిశయిల్లు.

(భాగత ఆరణ్య.)

జీవహింస చేయనివాఁడీ లోకమునం దేలేఁడు. ఒక్కొక్కరును తమతమ చేతనైనంతవఱకు, జీవహింస చేయక ప్రవర్తింపవలెనని ధర్మవ్యాధుఁడు చక్కఁగా వివరించియేయున్నాఁడు. అజ్ఞానకృతములగు జీవహింస లందరిచేతను గలుగుచున్నవిగాని తెలిసి తెలిసి చేయరాదని యభిప్రాయము.

{ కూరగాయలు ధాన్యము మున్నగువానిని
భుజించుట పాపము కాదా? }

మాంసభక్షణము చేయవలసినచో జంతుహింససంభవించుననియు నది మిక్కిలి పాపమనియు చెప్పితిరి. కూరగాయలు మున్నగువానిని తరిగి ఉడి

కించితిందురే అదిపాపముకాదా? అందున జీవహింసలేదాయనికొందఱువా
దింతురు.

## ఇందుకు సమాధానము.

ఆహారనిద్రాభయమైథునాని
సామాన్యమేతత్పశుభిర్నరాణాం
జ్ఞానీనరాణామధికోవిశేషః
జ్ఞానేవహీనఃపశుభిస్సమానః

(ఉత్తరగీత.

అనుచవముచొప్పున, ఆహారము. నిద్ర, భయము, మైథునము. మున్నగు వ్యవహారములు, పశుపక్ష్యాదిజంతువులయందున్నవేకాని వృక్షములయందులేదు. పశ్వాదులకాకలియైనచో గడ్డితినును. దప్పియైనచో నీరుత్రాగును. ఆయాసమైనప్పుడు నిద్రించును. కొట్టబోయినప్పుడు భయపడివణకును జాతీయమృగములతో క్రీడించును. చెట్లకిది యొక్కటియుంలేదు. పశ్వాదుల నొకచోటబంధించి సకాలమునందాహారమియ్యనిచోఁ గట్టియుండు త్రాటిని దెంచుకొనియైన పోయి యథేచ్ఛగా ఆహారమును సేకరించుకొనును. వృక్షములట్లుచేయవు. వృక్షాదులయందుగల చైతన్యము మృగాదులయందువలె వ్యక్తముగాలేదు. వానిని శరీరతాదాత్మ్యజ్ఞానములేదు * ఎచ్చట శరీర రాదాత్మ్యజ్ఞానములేదో అచ్చటహింసాదుఃఖముగాని బాధకానియుండదు

అంతస్సంజ్ఞాభవంత్యేతే తరుగుల్మలతాదయః
బహిస్సంజ్ఞాభవంత్యేతే నరపక్షిమృగాదయః॥

---

* ఇటీవలకొందరు పండితులపారపరిశ్రమచేసి చెట్లయందుఁగూడ (ప్రాణ) ధారణాదిశక్తులున్నవని గ్రహించి లోకులకునిరూపించుచున్నారు. అవియేయట్లుండనిఁక ప్రత్యక్షగోచరములగు జీవకోట్లను బుద్ధిపూర్వకముగాఁ జంపుటమిక్కిలి పాపముకాదా.

అను వచనముచొప్పున, తరుగుల్మలతాదులకు బహిస్సంజ్ఞలేదు. నర పక్షిమృగాదులకుమాత్రమే అంతస్సంజ్ఞకలదు. అంతస్సంజ్ఞ లేనివన్నియు నున్నచోట నేయుండునట్టివి. వానికి శారీరక బాధస్ఫురించదు.

## చెట్లు చేమలయందు జీవములేదా.

చరపదార్థములందుగల జీవభావము వేఱు. స్థిరపదార్థములందలిభావము వేఱు. సుఖదుఃఖ భయాదిచాంచల్యములకులోనై మనుజ, పశ్వాదులయందు జీవుఁడు వసించుచున్నాడుకావున హింసకలుగుచున్నది. ఈయర్థముచే నీదేహాపుణ్యసంవాదఘట్టమున భాగవతములో పిప్పలాయనుండను మహర్షియిట్లు వచించినాడు.

చర్మపంజరంబగు శరీరమున వసించెడి జీవుడు చెట్లు, తీగలు(గడ్డలు) మొదలగు వానియందు లేనందువలన నవి నిర్జీవములగును, వానియందు జ్ఞానవాహినీనాడులు లేవు. వానికి బాధతెలియదు అనివక్కాణించెను. కావున నిట్టికాయలు గడ్డలు మొదలగువానిని గోసికొనుటవలన జీవహింసకలుగ నేరదు.

## హింస యెన్ని విధములు.

“శుభాశుభ ఫలంకర్మ మనోవాగ్దేహ సంభవ” మ్మనుటచే కర్మ త్రివిధములగనుండును. అటుల, హింస కాయిక హింస, వాచిక హింస, మానసికహింస, యని ముత్తెరంగులు. తానుగానొక ప్రాణినిహింసించుట, కాయికహింస, ఒకరికిచెప్పిచేయించుట వాచికహింస, ఒకరు చేయుచుండగా చూచి సంతోషించుట మానసికహింస—కాయిక వాచిక హింసలను చేయక జాగ్రత్తపడియుండవలెను. వేరొకరు హింస చేయుటనుచూచినచో నట్టివారికి హితబోధచేయవలెను. వారు వినకపోయినచో భగవన్నామ స్మరణ చేయుచు పశ్చాత్తాపముతో నచ్చటనుండి వెడలిపోవలెను.

## ఎవరో యెచ్చటనోజంపిన జంతువుల మాంసమును దినుటచే హింసాదోషము కలుగునా?

మనోవాక్కాయములలో దేనిచేతచేసినను పాపము సంభవింపక తప్పదనియు త్రికరణశుద్ధిగా హింసచేయకుండవలెనని యు జ్ఞానులు వక్కాణించియున్నారు.

దీనిపై కొందఱీవిధముగ సమాధానము చెప్పెదరు.

జంతువులనుఁ జంపినఁగదా దోషము. మేము జంతువులనుఁ జంపుట లేదు. ఎవరో యెచ్చటనో వారికోరికకై హింసించిన వానిలో కొంత మాంసమునకు వెలయిచ్చి పుచ్చుకొందుము. లేక వారు తమంతట దెచ్చిచ్చిన దానిని భుజింతుము. అందున మాకేమి పాపము రాగలదు? అని వాదింతురు.

ఇది మిక్కిలి బుద్ధిహీనత. మరియు మాంసమునందలి దురాశ. ఎవరైన యియ్యని! ఎవరివద్దనైనం గొనని! జీవహింస లేక మాంసము దొరకదుగదా? ఇఁక పాపమెట్లు తప్పగలదు? (ఒకానొకవస్తువును) మేము దొంగిలించలేదు. ఎవరో దొంగిలించి మాకు తెచ్చియిచ్చిరి. లేక దొంగలవద్ద వెలకు తీసితిమన్నచో రాజదండన తప్పిపోవునా? ఇది యేపాటి మూర్ఖతనము!

శ్లో॥ అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ।
సంస్కర్తా చోపహర్తా చ ఖాదకశ్చేతి ఘాతకాః॥

(మనుస్మృతి అధ్యా-5-51.)

యమస్మృతియందును నిదేతీరున వ్రాయఁబడియున్నది.

అనగా ప్రాణిని హింసించుట కాజ్ఞయిచ్చువాడు, హింస చేయువాడు, అంగచ్ఛేదకుడు, అమ్మువాడు, కొనువాడు, వండువాడు, వడ్డించువాడు, తినువాడు అను వీరెల్లరును ఘాతకులనఁబడుదురని మనుస్మృతి స్పష్టముగా విధించుచున్నది. కావున నెవరో చంపినదిగదా యను భ్రాంతితో భక్షించువారు పాపమునకు భాగస్థులే యగుదురు.

## వేటాడుట పాపము కాదా?

పశ్వాదులనుఁ జంపరాదని వచించితిరిగదా? కొందరు వేటాడి మృగములను చంపుదురే వారికి పాపము లేదా యని ప్రశ్నింతురు. ఔను వేటాడుట మిక్కిలి హేయములగు జూదము, పానము, పరస్త్రీలంపటత్వము, ముష్కరత, కాఠిన్యము, అపాత్రదానములను సప్తవ్యసనములలో నొకటి. పులి, అడవిపంది మొదలగు వానిచే ప్రజలకును వారి పంటపైరుల

14

కును హానిసంభవించినప్పుడు క్షత్రియాదులు వేటాడి యాదుష్టమృగముల జంపి దేశమునకు సౌఖ్యమొనగూర్తురు. అది పాపముకాదు. ఎక్కడ వారునురా నాయనా యని వేచియుండి వెలుతురైనవెంటనే వలలను లను, తుపాకులను, కుక్కలను తీసికొనివెళ్లి అరణ్యమునఁబ్రవేశించి జింక కుందేళ్లు, దుప్పులు మున్నగు సాధుమృగములనుఁజంపి కడుపునించుకొను కుక్షింభరులకు మాత్రము పాపము సంభవించును. ఇది నిశ్చయము.

కం॥ శునకములఁ బెంచి యెవ్వం
డనయంబును వేటసలిపి యాత్మార్థముగా
వనమృగముల జంపును నా
మనుజాధము నస్త్రములను మర్దింతురొగిన్.

(శ్రీమహాభాగవత పంచమస్కంధము నరకలోకవర్ణనము

అని కడుపుకూటికై గుక్కలను బెంచి వేటాడి మృగములనుఁ జం వానికి నరకబాధతప్పదని విశదముగాఁ జెప్పఁబడియున్నది,

## జింక చర్మములు.

(ఆసనములు).

జపతపాదులయందు జింకచర్మములను శ్రేష్ఠమైన యాసనములని య పయోగింతురుకదా? జింకలను జంపక నవి యెటులదొరకఁగలవు? అ హింసకాదా? హింసకాదని యెవరుచెప్పగలరు? హింసయే. తమంతట చ్చినవాని చర్మములను గ్రహింతురుకాని సజ్జనులెవ్వరును జీవహింసచేసి జి కతోళ్లను సంపాదింపరు.

ఆ॥ వె॥ పుస్తకములు జడలు పులితోలు బెత్తంబు
కక్షపాలలు పదిలక్షలైన
మోతచేటుగాని మోక్షంబులేదయా
విశ్వదాభిరామ వినరవేమ.

అను వేమనగారి వచనముచొప్పున జింకతోళ్ళు మొదలగునవి ధరించి తీరవలెనను నిబంధన యేమియును లేదు. దానిచేతనే ముక్తికలుగదు. ఆత్మ

జ్ఞానశూన్యులగు డంబ గాండ్రు కొందఱిలాటి వేషములకై భ్రమించు చుందురు. అందుచేత నేయది సజ్జనాచారముగు నేమి?

ఆసనములను గురించి విచారించు నెడల దాని విచారము వేరు. అవి సిద్ధాసనము, పద్మాసనము, స్వస్తికాసనము, కూర్మాసనము మున్నగు 108 ఆసనములు కలవు. అవి తనశరీరమునువంచి ధరింపవలసినవే కాని జింకచర్మములను క్రిందికి వేసికొనుటయే ఆసనము కాదు.

{ మాంసభక్షక శాకభక్షకుల బలాబలవిచారము }

| | |
|---|---|
| అల్పబలవంతులగు మాంసభక్షకులు. | అమితబలవంతులగు శాకభక్షకులు. |

పూర్వమున.

| | |
|---|---|
| రావణ కుంభకర్ణ, హిడంబ కిమ్మీర, తాటకి, కంసాదులు. | శ్రీరామ, హనుమ, సుగ్రీవ, శ్రీకృష్ణ పాండవాదులు. |
| వామాచారపరాయణులగు మారీచ సుబాహాదులు. | రామ, లక్ష్మణ, విశ్వామిత్ర, కణ్వాదులు. |

ఇప్పుడు.

| | |
|---|---|
| రష్యాదేశపు సైనికులు ఇంగ్లీషుదేశ జట్టియగుశాండో | జపాను దేశపువారు హైందవజట్టియగు కో. రామమూర్తి. |

జంతువులలో.

| | |
|---|---|
| సింహము, పులి, మున్నగునవి. | ఏనుగు * |

*ఏనుగు స్వప్నములో సింహమువచ్చినను జచ్చునుకదా ? యని కొందఱందురు. ఈకథ యట్లుండని. సింహము మోసగించిపైకెగరి ఏనుఁగు కొందఱందురు... సింహము మోసగించి పైకెగరి ఏనుఁగు నేత్రములను పెరికివెచి దాని శిరస్సునుతొలిచి మెదడును నాశపరిచి చంపుచున్నది. అంతేకాని యెట్టెదుటనిలిచి పోరాడునేని ఏనుగు దాని నొకపూలచెండువలెనెగసరి చంపగలదు.

ఓమ్.

# జీవకారుణ్యము.

---

## పంచమలహరి.

### యజ్ఞములు.

ఈవఱకుఁ జెప్పఁబడినవేవో మన సౌకర్యములకుఁ గూర్పఁబడినవి. యజ్ఞయాగములందు జీవహత్య అందును గోహత్యయే చేతురుగదా? అది పాపము కాదా?

(సమాధానము.)

వేదాది శాస్త్రములయందు చెప్పబడియుండు యజ్ఞములవిచారము వేరు. పౌరాణికులచే వర్ణింపఁబడియుండు యజ్ఞములు వేరు.

### జ్ఞానయజ్ఞము.

తస్యైవంవిదుషో - యజ్ఞస్యాత్మాయజమానః । శ్రద్ధా పత్నీ శరీరమిధ్మ - మురోవేదిర్లోమానిబర్హిః । వేదశ్శిఖాహృదయంయూపః । కామఆజ్యం-మన్యుఃపశు స్తపోఽగ్నిః । శమయితాదక్షిణా - వాగ్ఘోతాప్రాణఉద్గాతా । చక్షురధ్వర్యుః । మనోబ్రహ్మా-శ్రోత్రమగ్ని - న్యావద్ధ్రియతే । సాదీక్షా ...॥

(తైత్తిరీయము-౬-౫.౨-౬.)

ఆయజ్ఞమున కాత్మయే యజమానుఁడు. శ్రద్ధ యతనికిపత్ని. దేహమే సమిత్తు. వక్షస్థలమే యజ్ఞవేదిక. (దేహమునందలి) రోమములే దర్భలు. శిఖయే వేదము, హృదయమే యూపస్తంభము. కామమే ఆజ్యము. క్రోధ

మే పశువు. తపస్సే అగ్ని. శాంతమే దక్షిణ. వాక్కే హోత. ప్రాణము ఉద్గాత. నేత్రమే అధ్వర్యుఁడు. మనస్సే బ్రహ్మ. శ్రోత్రము తేత్రాగ్నులు. ప్రాణధారణావధియే యజ్ఞదీక్ష. అన్నపానములను గ్రహించుటే సోమపానము. సంచారాదివ్యాపారములే అగ్నిష్టోమాదులు. ముఖమే ఆవహనీయాజ్ఞ. జ్ఞానమే హోమము. మహోరాత్రులే పూర్ణిమామావాస్యలు, ఋతువులే పశుబంధములు. మరణమే యజ్ఞాంతమున దీక్షావిసర్జన స్నానము. ఇది మానసికంబగు నిరుపాధికయజ్ఞము. దీనికి బాహ్యోపకరణము లక్కరలేవు. జీవహింస సంభవింపదు. ఇట్టియజ్ఞమాచరించు జ్ఞాని దేహాంతమున ముక్తిఁజెందును.

ఆ॥ ద్రవ్యలోభమునను దంబార్థమై పశు
వులనుజంపి జన్నములనుసేయు
వానిబట్టి యముని వారలుగోరుచు
నుందురెపుడు మిగులసందడిలుచు. (భాగవత-5)

ప్రశ్న:—వాజపేయ అగ్నిష్టోమాదులనగా నేమి?

ఉత్తరము:—ఈశ్వరకుఁజెప్పినట్లు వేదమునందు విధింపఁబడియుండునది జ్ఞానయజ్ఞము. మరియు

రాష్ట్రంవాఅశ్వమేధః అన్నంగ్ హిగౌః।
అగ్నిర్వాఅశ్వః ఆజ్యంమేధః॥

(శతపథబ్రాహ్మణ వచనములు,)

రాజు రాష్ట్రమును న్యాయముగా పాలించుట — అగ్నియందాజ్యాహుతి చేయుట. అశ్వమేధమనియు. అన్నము పృథ్వి ఇంద్రియములు మొదలగువానినిపవిత్రముగానుంచుట గోమేధమనియు శ్రుతివక్కాణించుచున్నది. ఇట్టి యర్థప్రదంబగు శ్రుతివాక్యమును పడనాడి ఏవోకొన్ని పురాణముల

యందుఁ జెప్పబడియుండు జీవహింసారూపమైన యజ్ఞములనే యెందుకు చేయవలెను? *

ప్రి:—యజ్ఞములో పశువధ చేసినను స్వర్గపదవి లభించునుకదా.

{ యజ్ఞఫలము స్వర్గము. (దానివివరము.) }

యజ్ఞము చేయువారికి స్వర్గపదవిలభించునని పురాణాదుల యందుఁ జెప్పఁబడియున్నది. స్వర్గలోకవాసుండగు ఇంద్రుఁడే పలుసారులు రాక్షసులచే భంగపడి పదభ్రష్టుఁడై తిప్పలొందియున్నాఁడు. ఇఁకనతని కేవిలుకడలేని యీస్వర్గలోకపదవిలభించుటచే ప్రయోజనమేమి? ఇట్టితుచ్ఛపదవికై యెందుకాశింపవలెను?

ప్రి:—అచ్చట రంభాసంభోగాది సుఖములు కలుగునుగదా.

## రంభాసంభోగము.

అదిమాత్రమేమిగొప్ప? వావి వరుసలులేక కన్నవారితో నెల్లకామసుఖమనుభవించెడి వేశ్యాస్త్రీలకంటె రంభయొండేమి విశేషము, దేవతాస్త్రీలన్నంతనే యకార్యకరణములను సరియనవచ్చునా, కామక్రోధలోభాది దుర్గుణములను ద్యజించి పరమార్థపదము నొందుటకుమారుగా పలుగాకితనమునకుఁ దిగుటమేలా, మరలసంభోగమునకే యాసపడవలెనా.

ప్రి:—రంభా సంభోగము తుచ్ఛమని మీరిప్పుడనుటేకాని పూర్వులెవరును నట్లనియుండలేదు.

ఉ.— నేను మాత్రమేయనుటలేదు. జ్ఞానులనేకులట్లువివరించినారు.

ఆ–వె. తల్లితో రమించె తండ్రియజ్ఞముచేసి
తనయుఁ డట్లె రంభదనరఁగూడె

---

*యజ్ఞములలో పశువులనుఁ జంపినను మరలవానికి పరలోకమున జీవమిత్తురట. అట్టినచ్చో స్వర్గవాసికి తుచ్ఛఫలదాయకములగుయజ్ఞములెందుకో

తల్లినిరమియింతురి దబ్బరమనుజులుఁ
విశ్వదాభిరామవినరవేమ.

శా. రంభాభోగముఁగోరియాగములకర్థంబెల్ల వెచ్చించుటా
యంభోదంబులఁజూచిచెయ్విజలమాద్యంతంబు చల్లించుట
ల్సంభోగేచ్ఛజనించెనేని మరివేశ్యారత్నముల్లేరొకో
సంభోగింపగరాదె కానరు జనుల్ జ్ఞానంబు సామాన్యమే

కం వినుఁడొకటి బావమఱఁదులు
జనక కుమారకులు మఖముసల్పిన రంభా
వనితంగవయుదు రటులై
నను లేవేవావివర్తనలు యజ్వాలకుఁ

(దశావతారచరిత్రము.)

ఇవి రాక్షసులను మోహపెట్టుటకై విష్ణువుచేబోధింపబడిన వంటి! జౌనౌను! విష్ణు చెట్టిబోధలంగాక యేమిచేయగలుగును! ఎంతోకష్టపడి, వేల కొలదిద్రవ్యమును వెచ్చఁబెట్టి యాగముచేసి సంపాదింపఁ దలంచునదియం తయు, నీరంభా సంభోగమనెడి స్వర్గలోక వేశ్యాసంపర్కమేకదా.

మొదటయజ్ఞముచేసి, రంభతోఁగూడుదురు. మరల పుత్రుఁడు యజ్ఞము చేసి ఆరంభనే వరించును, ఇది ఏమియవివేకము. ఏపాటిదురాచారము. వావివరుసలే గణింపనక్కరలేదా? శివవిష్ణ్వాదులపేళ్ళుబెట్టి యెన్నియో దు రాచారములు కల్పింపబఁడియున్నవి.

ప్ర—స్వర్గలోకమునకేగినపిమ్మట నిట్టిభేదాభేదము లెంచరాదు, అచ్చట వావివరుసలు లేవు.

## ఊర్వశి-అర్జునుఁడు (వావివరుసలు)

ఇప్పుడు బాగున్నది. మనహిందూశాస్త్రమునకుఁ బ్రత్యక్షవిరుద్ధముగా వచించెదరేల. ఏలోకమునందును వావివరుసలు లేకుండునా? తల్లిపిల్లలొకటేనా? పూర్వమొకప్పుడు పాండవులరణ్యవాసము చేయుచుండి తన్మధ్యదివ్యాస్త్రలాభమొందిన అర్జునుఁడు దేవేంద్రునిచే పిలువఁబడి స్వర్గమునకు వెళ్ళెను. అతఁడు దేవసభలో కూర్చునియుండగా అప్సరస్త్రీలగు రంభా, ఊర్వశి, మేనక, తిలోత్తమమున్నగువారు నాట్యము సలుపుచుండిరి. భరతశాస్త్రవేత్తయైన పార్థుఁడు వారి నాట్యమునుఁ బరికించుచుండెను. ఇంద్రుడా సంజ్ఞనెఱింగి యతనికి నూర్వశిపై నాసగలదను ఎన్నికతో నాటిరాత్రి యూర్వశిని పార్థునివిడిదికిబంపె వారిర్వురకిట్లు సంవాదముజరిగెను.

అ:—తల్లీ! నమస్కారము.

ఊర్వశి:—ప్రియా! ఇట్లనరాదు.

గీ॥ నీకు నేనాటితల్లిని నిజము చెప్పుమ
అమరలోకంపు వేశ్యలమైనమాకు
నిట్టితగవులునడవ వహీనబాహు
వీర్య ఇచ్చటపావియు వెదకజనునె

(భారతము. అరణ్య)

దేవలోకవ్యవహారము కావున మాకు వావివరుసలక్కరలేదుఁ నాతో గూడి రమింపుము. ఇంతకంటె భాగ్యమింకేమి పొందగలవు?

అ-కం॥ ఓహో ఇమ్మెయిధర్మ
ద్రోహోక్తులుపలుకదగునె ద్రోసంబిదిగా
దే హరిహరి! మనమునఁదగ
వూహింపకనన్నుఁ బలుకు టుచితమె నీకుఁ

ఛీ ఛీ పామరతనముచే నెందుకిట్లువచించెదవు? దేవలోకపు స్త్రీ యన్నంతనే నాభుజము లుప్పొంగునను కొంటివా. మీకొక వేళ నావివయస లక్కరలేకున్ననుఁజనె, మాకట్టిధర్మము నతిక్రమించుటకు వీలులేదు. కాక ను నీవు మావంశోత్తముండగు పురూరవుని నొకప్పుడు వరియించినావుకావా? ఒక్క పురుషనియమములేని వారకాంతనైనను తల్లిపిల్లలను నావిలేక వర్తింపరాదని బొత్తిగా నిరాకరించెను.

ఆ॥ సోమయాజిననుచు సొడ్డువేసియు రంభ
మైథునంబుసల్పె మమతతోడ
క్రతువుఁజేయుఫలము కామంబునకెగదా
విశ్వదాభిరామ వినరవేమ.

తుచ్ఛభోగములనిచ్చెడి పశుహింసారూప యాగములు క్రతువులు ఆత్మజ్ఞానులకెందుకు? కాముకులకది కావలసియుండు నేమో? *

పశుయజ్ఞము మాంసభక్షణమునకేగదా చేయవలెను

అహింసాపరమోధర్మః అని శ్రుతులుపలుగతుల వక్కాణించుచున్నను వానినిగమనింపక. నవ్యాయముగా పశుయజ్ఞము చేయువారు నరకానుభవముఁ జెందకపోరని జ్ఞానులనేకులు వచించియున్నారు.

ఆ॥ పేరుసోమయాజి పెనుసింహాఁబలుడాయె
మేకపోతుఁబట్టి మెడలువిఱుచు
క్రతువువంకదీక్ష కలుగునా మోక్షంబు
విశ్వదాభిరామ వినరవేమ

---

*క్రతువనగా! యూపముగల యజ్ఞము,
యాగమనగా! యూపములేని యజ్ఞము.

ఆ॥ సోమయాజిననుచు సొంపుతో వేషంబు
గట్టి మాంసమెల్లఁ గాల్చితినుచు
అగ్రిజన్ముఁడనగ నధికమే తనవల్ల
విశ్వదాభిరామవినరవేమ

జంతుహింస నిలిపియుంచు రాజులవివరము

సనాతనధర్మోపదేశకులైన శ్రీనందనలాల్ శర్మగారియుపదేశము చొప్పున పంజాబ్ దేశమునకుచేరిన పత్తోడీసంస్థానపు నవాబుగారు, కాధ్యవాడికి చేరిన మంగోల్రిల్, రధన్పూర్ సంస్థానముల నవాబులు, సహితము సంస్థానములలో గోహత్య చేయకూడదని రాజశాసనము దయచేసినారు. వీరుమిక్కిలి వంద్యులు.

(మదాస్ స్టాండర్డుపత్రిక 8-7-1913)

జంతువధ దసరాపండుగ—మహమ్మదీయులు వారిపండుగలలో గోవులనువధించిన హిందువులు వారిపండుగలలో ఎనుబోతులను, మేకలను, గొర్రెలను, కోళ్ళను, బలియిచ్చుచున్నారు, ఎట్లయిన నీరెండుమతములవారు ను జీవహింసచేయుచునె యున్నారు. జీవహింస సంపూర్ణముగ పరిత్యజించిన మతములు జైనబౌద్ధమతములు, వారు జీవహింస వర్జింపవలెనని పెక్కుండు మహారాజులను ప్రార్థించియుండుటచే 120 సంస్థానములలో నీసంవత్సరము దసరాపండుగలో బలులు నిలుపుచేయబడినవట. అల్వారు, బరోడా, భరతపూరు, గోండలు, బమనగరు, జనదను, ఖైర్పూరు, లింబ్డి, మోర్వి, పాలనపూరు, పోర్బందరు, రాజకోట, పచిను వంకనీరు మున్నగునవి బలులుమానిన 120 సంస్థానములలో కొన్నియైయున్నవి. ప్లేగురోగనివారణ సాధనమని దొరతనమువారెలుకలను చంపించుటగూడ జైనులకంగీకారము కాదట,

(సువర్ణలేఖ 29-10-1912)

లాహోరు ప్రాంతమున కొన్నిజిల్లాలయందు మహమ్మదీయ గృహస్థులు ఇఁకమీదట గోహత్య చేయుటలేదని నిష్కర్ష చేసిరి.

(ఒక్కలిగర పత్రిక బెంగుళూరు) 18-9-1913).

## యజ్ఞములను వాడుకకుఁదెచ్చినదెవరు?

## ఎప్పుడు?

హింసరూపమైన పశుయజ్ఞములు మహానీయులచే నాచరింపఁబడలేదు.

ఆత్మయోగసమాయుక్తో ధర్మోऽయం కృతలక్షణః॥

(భారత-అరణ్యపర్వము).

కృతయుగమున వేదోక్తమగు ఆత్మసమర్పణయోగమే ధర్మముగా నుండెనని తాత్పర్యము.

నైషధర్మః సతాందేవా యత్రవధ్యేతవైపశుః॥
ఇదకృతయుగం శ్రేష్ఠం కథంవధ్యేత వైపశుః॥

(భారత-శాంతిపర్వము).

(యజ్ఞమున) పశువును వధించుట శ్రేష్ఠమైన (ధర్మమైన) పనికాదు. కృతయుగమున పశువధయెక్కడిది? కాన నాకాలమేమంచి

## ఆత్మయజ్ఞము.

తనయందేగల అజ్ఞానపశువును జ్ఞానఖడ్గముచే ఛేదించి ఆత్మయజ్ఞము చేయవలెనను. జీవదయాపరుల యభిమతము నశ్లేషమగుపరచి జీవహింసారూపమైన పశుయజ్ఞమును స్మార్తులుకొందఱు స్థాపించిరి.

'అస్నారక్షః సంసృజతాత్"

(ఐతరేయబ్రాహ్మణము 6-7)

రక్తపూరితమైన పశువధ రాక్షసప్రీతికరమైనదని శ్రుతివక్కాణించుచున్నది.

కేవల కామ్యకర్మమగు నీపశుహింసారూపదుష్కర్మము మొదట నింద్రునిచే నీలోకమునఁ బ్రచారమునకుఁ దేబడెనని కొన్ని పురాణములయందు విశదముగా చెప్పబడియున్నది. మత్స్యపురాణము 143-వ అధ్యాయము, వాయుపురాణము 57-వ అధ్యాయము. భాగవతము చతుర్థస్కంధము భారతము మున్నగు పురాణేతిహాసములయందు పశుహింసారూపకయజ్ఞములు నిందింపఁబడియున్నవి.

పశువుల దైన్యావస్థనుఁ గాంచిన మహర్షులు మిక్కిలి పరితాపమొంది యాజ్ఞికకర్మను సహింపఁజాలక నింద్రునిఁగూర్చి ఇట్లు చెప్పిరి.

తేత్వా పృచ్ఛన్ విశ్వభుజం కోయంయజ్ఞవిధిస్తవ
అధర్మోబలవానేష హింసాధర్మేప్సయాతవ
నేష్టఃపశువధస్త్వేషః తవయజ్ఞే సురోత్తమ
అధర్మోధర్మఘాతాయ ప్రారబ్ధఃపశుభిస్త్వయా
నాయంధర్మోహ్యధర్మోయం నహింసాధర్మఉచ్యతే॥
ఆగమేనభవాన్ ధర్మం ప్రకరోతుయదీచ్ఛతి
విధిదృష్టేనయజ్ఞేన ధర్మేణావ్యసనేనతు
యజ్ఞబీజైఃసురశ్రేష్ఠ త్రివర్షపరిమోషితైః
ఏషయజ్ఞోమహానింద్ర స్వయంభువిహితఃపురా॥

నీవు చేయునది యెట్టియజ్ఞానుష్ఠానము? పశుహింసవలన గలుగఁదగు ఫలమునపేక్షించి నీవుజేయు నీక్రియ గొప్ప యధర్మము. యజ్ఞమునం దీవు చేయు నీవధసమ్మతమైనయది కాదు. ధర్మమును నాశనముజేయుకొఱకు నీవు పశుహింసాపూర్వకమగు నిట్టియధర్మమునఁ బ్రవర్తించియున్నాఁడవు. ఇది యెన్నఁటికిని ధర్మముకాదు. ఇది కేవలమధర్మము. హింసయనునది ధర్మమనిపించుకొనదు, కావలసినచో శాస్త్రప్రకారము యజ్ఞము నాచరింపు

ము. ఎవరికిని హింసలేని శాస్త్రవిహితమగు యజ్ఞమును ధాన్యములతోఁజే
యుము. అట్టి ద్రవ్యయజ్ఞము ధర్మమగును. ఇట్టియజ్ఞము నాడియందు బ్రి
హ్మర్షిధించెను. అని యెంతసమాధానము చెప్పినను ఇంద్రుడువినక సహింకరిం
చియుండెను.

### పశుహింసాయజ్ఞమును నిరూపించిన కూటసాక్ష్యము.

అప్పటి కనేకయజ్ఞములను ద్రవ్యపూర్వకము గాఁజేసియుండిన ఉపరి
చరవసువను వాతనిని సాక్షిఁజెప్పుమని కోరుకొనిరి. ఆవసువు ఇంద్రాదుల
దాక్షిణ్యమునకులోఁబడి యజ్ఞమున పశువధచేయవచ్చునని నిరూపించె. అట్ల
బద్ధము చెప్పినందులకై ఋషులతనిని శపించిరి.

అతడు హింసచేయువాడు కాఁడు. అరణ్యమునఁబుట్టిన కందమూల
ఫలాదులనే భగవంతునకర్పించెను. అట్టివాఁడు యజ్ఞమునఁ బశువధకావ
చ్చునని సెప్పుట యబద్ధముకద.

(మహాభారత శాంతిపర్వము 336-10-11)

తతస్తే ఋషయో దృష్ట్వా హ్యతంధర్మబలేనతు
వసోర్వాక్యమనాదృత్య జగ్ముస్తేవై యథాగతం
గతేషుఋషిసంఘేషు దేవాయజ్ఞమవాప్నుయః.

దేవతల కేవలయుద్దండతచే, ధర్మము నశించినదని యెంచి ఋషు
లు వసువాక్యమునంగీకరింపకయే వెడలిపోయిరి. ఋషులు వెడలినపిదప దేవ
తలు యజ్ఞములయందు హవిర్భాగములనునిరాతంకముగాఁ గైకొనుచువచ్చిరి.

ఇది పశుయాగప్రచారమునకు మూలకారణము ఋషిమునులు సమ్మ
తింపని ఈక్రూరకర్మమును ముముక్షువులు చేయరాదు. పూర్వమున ప్రాచీ
బర్హియను రాజు యజ్ఞములయందనేక పశువులను వధించియుండె. అతని
దురాగతమునకోర్వలేక నారదమునివరు లోకవాద గురెంచి ఇట్లనిబోధించిరి

రాజా, ఈపశుయజ్ఞమును నెపముతో నెందుకు వేలకొలది పశువులనుఁ జంపెదవు. దీనిచే నీకు మోక్షంబు చేకూరదు, చూడుము, చూడుమని జ్ఞానదృష్టియొసంగ, రాజాదృష్టితో వీక్షించి తనచేవధింపఁబడిన పశువులవేలకొలది భయంకరాకారములతో దన్నుచీల్చుటకై లోకాంతరమునందుఁ గాచియుండుటెఱింగి భయవిహ్వలుఁడై తపసిపాదములంబడి యతనిచే జ్ఞానమార్గంబెఱింగి యాహింసారూపదుష్కర్మను వర్జించెను. కావున నీదురాచారము ఇటీవల ఇంద్రాదులచే ప్రచారమునకు దేబడెనని వినబడుచున్నది. ఇదిరాను రాను, సర్వసామాన్యమై వామాచారము మొదలగు నానాముఖములుగా మారిపోయి దేశమును పీల్చిపిప్పిచేయుచున్నది.

(భాగవతము ౪ స్కంధం ౨ ఆశ్వాసము)

ఆ॥ ద్రవ్యలోభమునను దంభార్థమై పశు
వులను జంపి జన్నములను సేయు
వానిబట్టి యమునివారలు గోయుచు
నుందురెపుడు మిగుల సందడిలుచు.

అని హింసారూపమగు యజ్ఞములు మిక్కిలి హేయముగా పరిగణింపఁబడియున్నవి.

## అన్నిశరీరములలోని రక్తము ఒకటేకాదా?

అందరి శరీరములోని రక్తము ఒకటేయనియు, బ్రాహ్మణులశరీరమునపాలును, మాలమాదిగల శరీరమున రక్తమునుగలదా, యని వాదింపుచు విద్య నేర్చుటకెల్లవారును నర్హులేయగుదురను నూహజెందియాటుల విద్యనేర్చి యాభివృద్ధిఁజెందువారు, నన్నిప్రాణుల కష్టసుఖములొకటేయని ఏల తలంపరాదు.

## వేశ్యలు మద్యమాంససేవనము

దురాచారములయభివృద్ధికనేకమార్గములున్నను నవి తఱచుగా వేశ్యలమూలమున చాలనరకభివృద్ధిఁజెందుచున్నవి జూదము, పానము మున్నగు

నవి వేశ్యలవలననే యభివృద్ధి గాంచుచున్నదనుట యతిశయోక్తి కాదు. కల్లుసారాయములను గ్రోలుట, మాంసమును భక్షించుట, అపిని సేవించుట, పొడుము (నశ్యము) వేయుట, చీట్లాడుట, దొంగిలించుట, మున్నగు దురాచారములను యౌవనులగు పురుషులనేకులు వేశ్యలద్వారా నేర్చుకొనుచున్నారని వచించినచో వేశ్యాప్రియుల కపారక్రోధముప్పతిల్లును. మాంసాహారమునందలి ప్రీతిగూడ వేశ్యలవలన ననేకులు నేర్చుకొనుట తటస్థించుచున్నది వేశ్యలు దేవదాసీలనియు వారు దేవాలయములయందు, సభాస్థలములందును, నాట్యము చేయదగినవారు కావున వారవశ్యకముగా మాంసముభక్షింపవలెననియు, లేనిచో వారికి దేహదార్ఢ్యముండదనియు కొందఱు వాదించుటకలదు. ఇట్టివాదము మిక్కిలి హేయమైనదేయైనను, మాంసాహారము చేనట్టివారికిఁగూడ యేయుపయోగము గాని కలుగదనుట కీక్రింది యుదాహరణము మిక్కిలి సమంజసము గానున్నది.

ఈనడుమ రష్యానుండి ఇంగ్లాండునకు కొందఱు నాట్యాంగనలు వచ్చిరి. వీరిచక్కదనము,బడుచుదనము; చురుకుదనము, అవయవసౌష్ఠవమును గూడ నత్యద్భుతములుగ నుండెను. నృత్యము చేయునపుడు వీరుభూమిమీద పాదములు మోపకుండ నతిలాఘవముతో నృత్యము చేయుదురు. ఇట్టి శక్తి వీరికలవడుటకు కారణమేమని విచారింపగ వినుగ్రేసు ఆస్పినలుగారిట్లు వ్రాసిరి. మేము భుజించువస్తువులలోని మార్పులవలననే మాకిట్టిలాఘవము కలిగినది. మేము మాంసములను మత్స్యములను వర్జించితిమి. కేవల కందమూలఫలములనే తిందుము. మత్స్యమాంసముల దినుటవలన అవయవములలో నుండు లాఘవమునశించి మొద్దుబారును- వార్ధక్యమువచ్చును, ధాన్యములు కాయగూరలు, పండ్లు మొదలగు విశేషభాగము ఆలివునూనెచేర్చి పుచ్చుకొనినచో దేహమునకు కాంతియు లాఘవమును కలుగును. మనము తినువస్తువులలో బలముకలిగించు భాగమును పిప్పిని విభాగము చేయుటకు శరీరములోని శక్తి యెంతయో ఖర్చుపడుచున్నది. అట్లుగాకుండ మనము భుజించు వస్తువులలోని నిస్సారపదార్థమునుతీసివేసి సారపదార్థమునే మనమారగించి

నచో అదియంతయు శరీరమున జీర్ణమైరక్తముపట్టును. మేము వెన్న జున్ను, పాలు గ్రుడ్లు మొదలగునవి తినము. మేము తినువస్తువులను లేహ్యపాకములలో తిందుము. ఆలివునూనెయే మాకు ముఖ్యముగా బలముకలిగించు పదార్థము. రోజుకు 4 పెద్దచమ్చాల నూనెను మేమొక్కొక్కరము ద్రాగుదుము. మేము పగలు 11 గంటలకు సాయంతనము 6 గంటలకు 2 సారులే భుజింతుము. భోజనసమయమందే నూనె వాడుదుము. సారాయములు త్రాగము పరిశుద్ధమైననీటి నిత్రాగుదుము. మేము మధ్యమధ్య ఫలాహారములు చేయము. మేము సాధారణముగ, పదార్థములను పక్వముచేయము. విశేషముగ నములుదుము. ఇట్లు భుజించుటవలన ఉత్సాహము, సంతోషము సంపూర్ణారోగ్యము సౌఖ్యము ఆకలికలుగును, జలుబుచేయుట, వ్యాధివచ్చుట, అంటువ్యాధులు కలుగుట, మొదలగునవి యుండవు. గాఢనిద్రపట్టును, మొదట కష్టముగనుండును. కాని క్రమముగ నీయాహారమలవడును. కొందరికి 3 నెలలలోను మరికొందరికి 6 నెలలలోను అలవాటుకలిగినది మేము టీ, కాఫీ, మొదలగునవి ఏమియును త్రాగము. పొగచుట్ట నల్లమందు మొదలగునవి యుపయోగించము. అని ఆమె వ్రాసినదానిని చూచి గొప్పగొప్ప డాక్టరులీవిషయమును పరిక్షింపజూచుచున్నారు.

(సు-లేఖ-1912.)

మనదేశపు వేశ్యలుకొందఱు నస్యమువేయుట, కల్లుత్రాగుట, మాంసముదినుట, బ్రాందీ, సారాయములును పొగత్రాగుటలలోనే కాక యీదురాచారములను నానోపాయములచే విటులకును బ్రసాదించుచున్నారు. అకటా !! ఎంతఘోరము.

## వామాచారము.

ఈపేరుతో లోకమునుముంచి మూలకుబెట్టెడి దురాచారము మానవసంఘమునకే యపకీర్తిదెచ్చుచున్నది. ఇది కేవలము కల్పితగ్రంథాధారముగలమతము.

పీత్వాపీత్వాపునఃపీత్వా యావత్పతతిభూతలే
పునరుద్ధాయవైపీత్వా పునర్జన్మ నవిద్యతే.

(మహానిర్వాణతంత్రం)

మద్యంమాంసంచమీనంచ ముద్రామైధునమేవచ
ఏతేపంచమకారాఃస్యుర్మోక్షదాహియుగేయుగే.

(కాళీతంత్రము.)

త్రాగుము, త్రాగుము, మరల త్రాగుము! (పరిజ్ఞతప్పి) నేలకు పడువరకు త్రాగుము, మరలలేచి త్రాగుము. (అట్లుచేసినచో పునర్జన్మములేదు *

మద్యము (కల్లు), మాంసము, మత్స్యములు ముద్ర, మైధునములను నీపంచ మకారములను ధరించువారికి మోక్షములభించునని తాత్పర్యము.

కాళీతంత్రము, కులార్ణవ తంత్రము, జ్ఞానసంకలినీ తంత్రము మున్నగు తంత్రగ్రంథము లీదురాచారమునకుఁ బ్రమాణము,

ఈమతము వారికి వావివరుసలులేవు. శిష్యునిభార్య యతనితోడపై పండుకొనుటయు గురువామెతో సంగమించుటయు, తదీయమగు వీర్యమును మద్యముతోఁగలిపి యెల్లవారును సేవించుటయు, నీమతము నందలి వాడుకలు. „చచ్చినాదోషములేదు„ పేరుచిరంజీవియన్నటు లీమతమున దురాచారము ప్రబలముగానున్నను వస్తువులకు వీరొసఁగియుండు నామప్రతినామములు మిగులబాగున్నవి,

(నీరుల్లి) యెర్రగడ్డను వ్యాసులనియు, తెల్లగడ్డను శుకులనియు, కల్లు ద్రావువారిని దీక్షితులనియు. వ్యభిచారస్త్రీని క్షేత్రవాసినియనియు, మేకను భూచరియనియు, (మాంసమునకై దెచ్చెడి) పక్షులను ఖేచరియనియు, మత్స్యములను జలచరియనియు, కల్లును మద్యమయనియు, వ్యభిచారస్త్రీని శాంభవియనియు, తత్సంపర్కమును షణ్ముఖిముద్రయనియు, ఈపంచము

---

* త్రాగుము, అధవాత్రాగవలెను, అని యెట్లైనఁ జదువవచ్చును.

దగ్రిలే మోక్షదాయకములనియు చిత్రవిచిత్రముగా వర్ణింపుచు, పూర్ణిమా మావాస్యాదిపర్వకాలములందు, భగార్చన, భగలింగార్చన, అధఃకేశార్చన, బిందుసేవలను పేరుతో దురాచారమగ్నులై పరలోక దూరులై నశించు చుండుటయెంతయు శోచనీయము.

కం॥ విను సురతోఁగూడఁగ దె
  చ్చినయట్టిది యెద్దియును భుజింప రభోజ్య
  త్వనిరూపణ నిపుణతగల
  మనుజోత్తములఖిలలోక మాన్యచరిత్రా

(శ్రీభారతము)

కల్లుతోగూడా దెచ్చిన ఏపదార్థమునైనను మహాత్ములు పుచ్చుకొన రని తాత్పర్యము,

## దుష్టగ్రంథవిచారము.

విష్ణువుచేఁజెప్పఁబడినదనియు శివుని చేజెప్పఁబడినదనియు పేర్లుపెట్టి దురాచారపరులగు స్వార్థులు కల్పించియుండు దుష్టగ్రంథములవివర మీ క్రింద వ్రాయఁబడుచున్నది.

విష్ణువు తారకాక్షు, క్షమలాక్షాది రాక్షసులకు దారుకావనమువం దిట్లు బోధించెనట; (దశావతారచరిత్ర 6.వ అధ్యాయము.)

గీ॥ అప్పుగొనియైన దొంగిలియైన లెస్స
  జిహ్వకింపైనదాని భుజింపవలయు
  కంటికింపైన కాంతలఁగవయువలయు
  బ్రతుకుదినముల మోక్షంబువెతుక నేల.

సీ॥ సురద్రావుచుండు మీగురుడు భార్గవపాని
  పారుడేనరక కూపమున మునిగె
  చలపట్టియధ్వరాశ్వములదొంగిలిపోవు
  వాసవుండేరౌరవమున గూలె

నేకర్మములు లేక నిచ్చగా విహరించు
సనకాదులెట్టి యాతనలఁ బడిరి
బలవంతమున గురుకులకాంతఁబట్టిన
వనజారి ఏదోష మనుభవించె

గీ॥ భళరె వారికిలేని పాపములు మనకె
గలిగెనే తనువున ముక్తిగదయటన్న
కాయమెడలిన మోక్షంబెగాక మరి శ
రీరమేడది? సుకృత దుష్కృతము లేవి?

ఈ క్రిందివాక్యములు శివునిచే జెప్పఁబడినవఁట.

శ్లో॥ రజస్వలా పుష్కరంతీర్థం చాండాలీ తు స్వయం కాశీ।
చర్మకారీ ప్రయాగస్యా ద్రజకీ మధురా మతా।
అయోధ్యా పుల్కసీ ప్రోక్తా॥

(రుద్రయామళతంత్రము),

రజస్వల (ముట్టు) అయియుండు స్త్రీతోఁగూడిన పుష్కరస్నానము చేసినంత పుణ్యమట. మాలదానితోఁబోయిన కాశీయాత్ర చేసినటు, మాదిగదానింజేరిన ప్రయాగస్నానఫలము, చాకలిదానింగూడిన మధురాదర్శనఫలము, బోగముదానితోఁబోయిన నయోధ్యాదర్శనఫలమబ్బునఁట,

ఆదిధార పరబ్రహ్మ మధ్యధార రమాపతిః
అంత్యధార మహాదేవ మూత్రపానంతు ముక్తిదమ్॥

ఈమంత్రము శిష్యరాండ్రగు స్త్రీలకు (వ్యభిచార) గురువు లుపదేశించు మంత్రము. టిబెట్టు దేశములో సంవత్సరమున కొకతూరి (గ్రాండ్ లామా) యను గురువుయొక్క మలమును కొందఱు భక్షింతురట. దానింబోలి

ఈమతములో పర్వ్యానములయందు పంచలము (మల, మూత్ర, ఊళ, పీళ గుళిమి) మున్నగు వీర్యాదులనుగూడ భక్షింపవలయునంట.

ఇట్టిదురాచారములను బోధించెడు దుర్గ్రంథములను పరమపావనమైన వని శిరసావహించి యట్లాచరించెడి భ్రాంతచిత్తులకు జీవహింసయన గా నేపాటి?

ఇంతకు తెగించినవారికెంతకైన తెగింపఁగలరు * ఆహా (వారి) తల బుఱ్ఱలు బంకమట్టితో చేయఁబడినవేమో తెలియకున్నది?

## వల్లభాచార్య సంప్రదాయము.

దీనికి కొదవగా ఉత్తరహిందూస్థానమునం దచ్చటచ్చట రాధామాధవ మతమను పేర నొకమతము స్థాపింపబడియున్నది. దాని మూలపురుషులు వల్లభాచార్యులువారు సాక్షాత్ కృష్ణమూర్తియట. వారిశిష్యులందరును గోప గోపికలట, శ్రీకృష్ణుడు యమునాతీరమం దెన్నివిధముల గ్రీడించెనో వీరును నట్లె క్రీడించుచుందురు. దుర్భిక్షమువంటి యధికమాసము తలవేసిన ట్లీదురాచార మునకు తోడుగా, కంచుకోత్సవమను పండుగ నొకటిని ఈతెగవారు చేయు దురు. గురుశిష్య శిష్యురాండ్రందఱును స్వేచ్ఛగతిని త్రాగి మత్తెక్కిన వారై స్త్రీలరవికెల నొకగదిలో నైచి, ఎత్తుకొనునప్పు డెవనికేవతె రవికె దొరకునో వాడాస్త్రీతో తల్లియయినను, తోబుట్టువైనను, పాటింపక భోగించును. అకటా! మతమెంత మురుముగామారినది. మహారాజులని ఈ గురువుల పేరు. ప్రభుత్వమువారి ధర్మశాసనములకు వెఱచి ఈదురాచారములు లోలోనఁ జరుగుచున్నవి. హా!!

---

* మద్రాసుప్రాంతమునందచ్చట డెంకనీకోటవద్ద చిక్కనపల్లియను గ్రామ ములో చిక్కమ్మ దొడ్డమ్మ పరస జరుగుచున్నది. స్త్రీలు వస్త్రహీనలై వేపాకుఁగట్టుకొని మెరయుటయు పురుషులు భండవేషములతో వారినివె న్నంటిపోవుటయు నీమొదలగునవిజరుగుచుండెను. ఇప్పుడీదురాచారముచాల వఱకు తగ్గిపోయినది. పరమేశ్వరానుగ్రహముచే బొత్తిగానిలిచి పోవుఁగాత

## రామానుజకూటములు
## శరణాగతివైభవము.

జాతిమత వివక్షణసేయక నాచండాలపర్యంతము జనులను వైష్ణవమతమునఁజేర్చుకొన్న పరమపవిత్రులగు శ్రీరామానుజులపేరునకు కళంకప్రాయమయిన దురాచారములు కొన్నిప్రబలుచున్నవి. మాంసభక్షకులకు శూద్రివైష్ణవులు కొందఱు జిహ్వాచాపల్యబద్ధులై అభక్ష్యభక్షణ అపేయపానమస్తులైపిశాచములమాడ్కి సంచరించుచున్నారు. వీరిదురాచారమును గుఱించి సన్మార్గబోధిని, యనుపత్రికయందిట్లు వ్రాయఁబడియుండెను.

సీ॥ క్రొత్తగాజచ్చిన యత్తద్దినమంచు
తిత్తులసారాయి దెచ్చునొకడు
యందులోనికినంజు* డనుకూలమ యటంచు
కోడిపెట్టలబట్టి కోయునొకడు
మాంతాతనాడిది మర్యాదటంచును
మేకతలలంబట్టి మెక్కునొకడు
చాతానిగురువుల చేతితీర్థంబాని
ప్రీతిసారాగ్రోలి ప్రేలునొకడు
గీ॥ వీరలటఆ సదాచారధీరులంట
నీతికోవిదులట మహానీయులంట
సూరిజనులార వినరయ్య చూడరయ్య
కటకటా కాలమహిమల గాంచరయ్య.

* వంజుడు — మాంసము.

ఇట్టిదురాచారపిశాచములను వైష్ణవులనుగామార్చిన శ్రీరామానుజులు ఆకాలపు ప్రజావిప్లవమునుబట్టి ఆహారసంస్కారముజేయరైరి. దుష్పదార్థ సేవనకూడదని వారప్పుడే పేరు పెట్టియుండినచో జనులు తమమతమునువిడనాడుదురనుసూహతో కాలాంతరమునందట్లు చేయవచ్చునని వారూరకుండిరి. అంతలో వారును సాయుజ్యపదమునొందిరి. అపైజెప్పువారు తక్కువనైనందున నీదురాచారము ప్రబలుచువచ్చినది. శ్రీశంకర రామానుజ మధ్వాచార్యులను మహాత్ములచే స్థాపింపఁబడిన ధర్మము లతినిర్మలములయ్యును, వానిమర్మమెఱుంగలేక కొందఱు దురాచారములపాల్పడి చెడిపోవుచున్నారు. వామమార్గులతోఁజేరిన యద్వైతులలో కొందఱటుండ నిర్మలమైన వైష్ణవమతమునుండి యనేకులు రామానుజకూటమునకుఁజేరి తిని త్రాగి దొప్ప దోగుచున్నారు.

వామమార్గులవలెనే వీరును మిక్కిలి దురాచారపరులు గొఱ్ఱె మేకలను నల్లదేవరయనియు, కోడిని జుట్టుపెరుమాళ్ళనియు, కోడిగుడ్లను సామవుంటనియు, కల్లును తీర్థమనియు శిష్యురాండ్రతో భోగించుటను శరణాగతివైభవమనియు పేళ్ళుపెట్టుకొని ఘటార్చనను నెపమున యథేచ్ఛగా మాంసము మెక్కుచు మద్యపానమత్తులై విఱ్ఱవీగుచున్నారు.

ఆ॥ ఎలమి మతమటంచు నెల్లమాంసము దిని
మారుపేరుపెట్టి మధువుద్రావి
పావివరుసదప్పి వలికిపాలౌదురు
విశ్వదాభిరామ వినర వేమ.

—:మద్యపాన నివారణోపాయములు:—

కం॥ లోకము నిర్మర్యాదా
వ్యాకులమైచెడదె సజ్జనావళి మధుపా
నాంకాంక్ష దొంగకున్న గు
ణాకల్పా ఏమిసేయ దక్కుడునరుఁ.

కం॥ కావున నేవిధమున సుర
సేవింపక యుసుగుటొప్పు చెలువ సకల వ
ర్ణావళికి దానఁగీర్తి
శ్రీవైభవపుణ్యగతులు చేర్చికొననగున్.

(శ్రీమహాభారత-అనుశాసని)

భారతాదిగ్రంథములయందు మద్యపాన మత్యంతహేయమగు దురభ్యాసమని గర్హింపఁబడియున్నది. ఈదుర్వ్యాడుకనుండి జనులకెల్లవిమోచన మొదవునని దేశబాంధవు లహోరాత్రము లెడతెగని కృషిసల్పుచున్నారు. ఇట్టిమహాప్రయత్నము లెన్నిచేయఁబడినను, చక్కగా వేరూనియుండు నీ దురభ్యాసము నానాట యభివృద్ధిఁజెందుచునేయున్నది, ఏదియెట్లయినను విద్యావంతుల ఘనప్రయత్నముచేతనే యది నివారింపఁబడవలసియున్నది, సదాచారసంపన్నులను జూదియయిన త్రాగుబోతులు మంచిదశకు వత్తురు గాఁక.

చెన్న రాజధానిలో త్రాగుడు విశేషముగ వ్యాపించుచున్నదనిన సంగతి సర్వవాదమయినది. గౌరవనీయులగు త్యాగరాయశెట్టి రామచంద్రరావుగార లుదహరించిన సంగతులను అంకెలను దొరతనమువారు ఖండింప జాలరైరి. కాని దినదినాభివృద్ధినొందుచున్న ఆదాయమును వ్యాజింపవలసిన దనిన దొరతనమువారొప్పుకొనరు. „విద్యయభివృద్ధియయినకొలది మీలో త్రాగుడు వ్యాపించుచున్నది. మీచేతనయినచో మీజనులను త్రాగకుండ నాపుడు. మాయాదాయమును మేముపోగొట్టుకొనము,, అని గూడుముక్కలతో సర్ మరేప్రహామిక్ దొరగారు గవర్నమెంటువారిపక్షమున జవాబిచ్చిరి. డేఁడ్సనుదొరగారు ధాన్యపుధరలు హెచ్చినకొలది డబ్బురెక్కువ సంపాదించి జనులెక్కువ త్రాగుచున్నారనిరి. ఇది యెంతమాత్రము నిజము కాదు, ధాన్యపుధరలవలన బాగుపడినది భూస్వాములు. వీరిలో జాలమంది కళ్లోట్లు మద్యపానము నైన ముట్టనివారు. ఇంటియందు దిమటకులేక పెం

డ్లాముబిడ్డలు అన్నమో రామచంద్ర అని యేడ్చుచున్నను, ధాన్యపు ధర లెక్కువయినను దక్కువయినను నిరంతరము సారాయి సముద్రములోగొట్టు కొనువారికెక్కువాకర్షణములను గలిగింపవద్దని త్యాగరాయశెట్టిగా రుపపాదించిన నిరాక్షేపనీయమయిన తీర్మానమును సయితము దొరతనమువారుచాల భాగ మంగీకరించకుండుట మిక్కిలి శోచనీయమైనది.

ఈత్రాగుడువలనగలుగు అసంఖ్యాకములగు మహానర్థకము లింగ్లండు దేశవాసులకు సువేద్యములు. ఇంగ్లండు దేశప్రజలను పిండిపిప్పిచేయుచున్నదే యీత్రాగుడు. ఈకీడు బాగుగ దలయెత్తుచున్న యీదినములలో సర్వసాధనోపాయములవలన వ్యాపింపజేయకుండరేని దొరతనమువారును జనులును ముమ్ముందు బశ్చాత్తాపము పడవలసివచ్చును. "అయ్యో, మనదేశవాసులలో నీమహామారివ్యాపించి వారికుటుంబములను ధ్వంసము చేయుచున్నదే, ఎటులనా దీనినాపుట" యని హైందవసభ్యు లెట్లనుకొందురో అవిధముగానే సర్ మక్రేవోమిక్ గారును అట్కిన్సను దొరగారును అనుకొనెదరేని యీచెడుగునాపుటకయి వివిధోపాయములు వారిమనస్సులోనికి బరుగెత్తుకొనిరాగలవు. అనగా వారీవిషయములో దాము హైందవులమని యూహించుకొనవలయును. అట్లుగాక వాదనలలోనికి దిగెదరేని అగాధమయిన మహాసముద్రమువంటి యీవిషయమునుగురించి వారెన్నిదినములు పోరాడినను వాదన మంతమొందునట్టిదికాదు.

పండుగదినములలోను, దీర్ఘములప్పుడును అన్నితెగవులకును గారణమీత్రాగుడే! కోటప్పకొండ అల్లరికి గారణముత్రాగుడు. దానివలన గవర్నమెంటువారికెంత ధనవ్యయమయినదో అట్కిన్సను గారికి దెలుసును. ఈతిరుణాలలలో మద్యపానవిక్రయము చాలవరకాపబడితీరవలయును. ప్రతికూలివాడును సూర్యాస్తమయమున కింటికి పల్లెలలోవెళ్ళితీరును. ఇంటికివెళ్ళునపుడే "ఒకకాయవేసుకొని" పోదురు. రాత్రి తొమ్మిదిగింటలవరకును మద్యమమ్మబడుచుండుట "అవసరమయి త్రాగువాండ్లు" కయిన ననవసరము. దొరతనమువారు నిజముగా నీవిషయమై జనుల కుపకారము జేయదలంచి

లేని ప్రతిసంవత్సరము సారాయి అమ్మకమువలన గొంతమొత్తముకంటె నెక్కువసొమ్మును గడించరాదు, అని నిశ్చయము చేసుకొని, అంత మొత్తము ఆదాయముగావచ్చు సారాయినే దుకాణములకీయవలయును. అట్లు చేయుటవలన నీకీడుయొక్క వేరుదుంపమీద గొడ్డలిపెట్టువేసినట్లగును. చీనాయొక్క ప్రజలను రక్షించుటకయి నల్లమందు వారికమ్మబడుట అపబడుచున్నప్పుడు స్వదేశమందు వ్యాపించుచున్న యీసారాయి ప్లేగు నాపుట మాత్రము దొరతనమువారి కర్తవ్యముకాదా? ఇందువలనగలుగు ధననష్టమును దిగుమతి సరకులపై సుంకమును వేసి రాబట్టుకొనవలయును. చెట్లక్రింద నప్పుడప్పుడే గీచిన కల్లమ్ముటవలన నందు నిషాయుండదు. పులియుటవలన మైకము కలుగును. ఆదాయముకంటె జనుల ఆరోగ్యము హెచ్చుగా బరిగ్రహింపబడెనేని యీపద్ధతి చాలమంచిది. ఇప్పుడు ప్రతిసంవత్సరము వేలము వేయుటవలన పాటహెచ్చుగాబెట్టి ఆసొమ్మును ఆసంవత్సరములోపలనే లాభమునుగూడ లాగుకొనుటకు కంట్రాక్టుదారులు వివిధమాయోపాయములను బన్నుచున్నారు. మూడుసంవత్సరముల కొకతూరి వేలమువలన దమ ద్రవ్యమును లాగుకొనుటకయి ఇంత తొందరపడరు. దొరతనమువారి రివిన్యూ ఉద్యోగీయులకును గొంత విశ్రాంతియుండును. తమకాలములో ఇక్క కంటాక్కువందువలెనే సారాయిమందును నెక్కువాదాయమును దొరతనము వారికిజూపి వారిమెప్పును బొందవలయునను. అభిలాషగూడ నీ యుద్యోగీయులకు గొంత తగ్గగలదు. ఈవిషయమునుగురించి ఎంతైన వ్రాయవచ్చును. సారాయిశాఖను గల్పతరువుగా మాత్రమే దొరతనమువారు భావింపలేని వారికీమద్యపానమును దగ్గించుట కనేకసాధనములుండగలవు.

(ఆంధ్రపత్రిక 28-2-1912.)

మనము ముట్టనివారమని సంతోషముతో దృప్తినొందగూడదు.

మనమీపిశాచము నోటిలో బడకుండుటయేగాక మానవకోటి నిమిత్తాగమై దినదినమును పరిశ్రమచేయవలసియున్నది. మనసహోదరులను మన స్వంత కృషివలన నీదయ్యముబారినుండి తప్పించినప్పుడే దేవుడు మనకిచ్చిన

యోత్తరవాదమును నిర్వర్తించినవారమగుదుము. పరమేశ్వరుని దృష్టిలో మానమందరేమును ఏజాతివారమయినను, ఏకులపు ఏమతపువారమయినను సహోదరులము. మనమందర మాతనిబిడ్డలము. మన సహోదరత్వమును గ్రహించి సహోదరులవలె అధమాధమస్థితియందున్న ఆతని బిడ్డలయెడ సయితము మనవిధులను నిర్వహింపవలయును. మద్యపాననిషేధనా సంఘపక్షమవలంబించి ప్రతిదినమును ఎంతస్వల్పపు పనినయినను జేసితిమేని కృతార్థుల మగుదుము. స్వల్పారంభముతో దృష్టినొందుము. సంవత్సరాంతమున నొక్కమనిషినయినను త్రాగుడు పిశాచమునుండి గాపాడితిమేని మనశ్రమ వృథాగా నేరదు. దేవుడును మన సత్పరిశ్రమకు దగినఫలముల నీయకపోడు,,
(కూనూరులో బ్రిగేడియర్ జనరల్ బాంకుదొరగారి సంభాషణములోని భాగము,)

ఇట్టి గొప్పవారి యభిప్రాయములను కలలోనైన నెఱుంగని స్వార్థులు చేయు దురాక్షేపణలకు జంకక ఈదురాచారమును చేతనైనంతవరకు మాన్పుటకై యత్నింపవలెను.

## నరవధలు.

ఆత్మజ్ఞాన పరిపూర్ణులగు ఆర్యులు కాలధర్మమొందినపిదప రాను రాను దేశీయులయందవివేక మెక్కువయై దేవతలకు నరబలి యిచ్చెడి దురాచారము వామమార్గులద్వారా ప్రచారమునకువచ్చెను ప్రబలాంతఃపురనివాసినియైన రాణీసంయుక్తవంటి సంపన్నురాలినిగూడ కాళికి బలియిచ్చుటకైగొని పోయియుండిరని చరిత్రలో మన మనుదినముచదువుచుండలేదా? ఇప్పటికిని నరబలులు అరుదుగా నచ్చటచ్చట జరుగుచునేయున్నవి- ఢిల్లీనగరమువద్ద, యమునావో, యనుగ్రామసమీపమునందు దుర్గాష్టమినాడు ఆరేండ్లవయస్సుగల బాలకుని నొకనిని. సీతాదేవి యను గుడివద్ద (దేవతకు బలియిచ్చి పూడ్చి పెట్టియుండిరి.

(ఒక్కలిగరపత్రిక 1-1-1913

## నరబలి ఇచ్చెడిమతములే కొన్నిగలవు

(నరవధమతము.)

లూయిసుర్కోలులో నీమధ్యనరహత్య కొకడురిదీయబడెను. వాని కూతురుక్లి మెంట్లుసనునామె యాహత్యలన్నిటిని తానేచేసితినని యొప్పుకొనుచున్నది. చంపబడినవారందరును నీగ్రోజాతివారు వారినిచంపుటపుణ్యమని యామెయభిప్రాయము. వారిమతము నరబలిమతము. (Churchof Sacrifice) గొంతునులుముట నాకుపరమసంతోషమని యామె, యత్యుత్సాహముతో చెప్పువైఖరినిబట్టియే యీమె యెన్నిహత్యలుచేసెనన్ననునమ్మవచ్చును. చిన్న పెద్దలను 17 గురిని ఆమెచంపితినని యొప్పుకున్నది. రాత్రి వారునిద్రపోవుచుండగా వారింట్లోకేగి మైకముగ్రమ్ము మందు వారినోటబోసి గండ్రగొడ్డలితో వారితలనరికి ఆరక్తముతో వాగోడమీద నొకమతగ్రంథవచనమునువ్రాసి ఆమెపోవుచుండునట. 18 నెలలలో 35 హత్యలుజరిగినవి. కానబట్టియిచ్చిమతముగలవారు కొందరు బయలుదేరినట్లూహించుచున్నారు,

(సువర్ణలేఖ 14-15-1912)

ఇంతకంటె పాపమువేరొక్కటికలదా?

## శుష్కవేదాంతులు.

ఈవరకుచెప్పిన వామమార్గ రామానుజకూటములవలెనే ఈతెగవారును దురాచారమత్తులు. ఆత్మజ్ఞానశూన్యులై భంగిపత్రిపీల్చుటతోనే వేదాంతము సిద్ధింపగలదను దురూహతో భకారమతములయందీ తెగవారందరునుం గూడి సోమరిపోతులై వ్యర్థముగా కాలము పుచ్చుచున్నారు.

జీవహింసయనక అవివేకమూలమనక మద్యమాంసాదులను సేవింపుచు ఒడలిపై ప్రజ్ఞలేక,

"జీవుడా భ్రమలుడిగి నిజగురుదేవుడైతివి చూడరా!
చావుపుట్టుకలేని చిత్కళాభావుడైయున్నావురా॥

యను నిత్యానిపిండిపదములు పాడుకొనుచు అవ్యక్తప్రలాపములతో నిరర్థక యుగా ప్రాస్నా బుచ్చుచుందురు. నీతిలేని శుష్క ప్రలాపము లెందుకుఁబనికి వచ్చును.

తే. కల్లుద్రావుట గురుపత్నిఁ గవయుటయును
విప్రఁజంపుట బ్రహ్మస్వ విషయమైన
ముచ్చిలుటయును నివిగల క్రూరజనుల
బ్రీతిఁబొందుటయును మహాపాతకములు

తే. వెలదిజూదంబు పానంబు వేటపలుకు
ప్రల్లదంబును దండంబుఁ బరుసదనము
సొమ్మునిష్ప్రయోజనముగ నమ్మనేఁత
యనెడుసప్తవ్యసనముల జనదుతగుల.

(శ్రీమహాభాగవతము.)

—*సర్వప్రపంచం—జంతుమయం*—

చ. సలిలములుర్వియాకసముసర్వముజంతుమయంబుగావునన్
గలుగునవశ్యముగ్ సకలకర్మలయందునహింస; హింసకుం
దొలగినదేహయాత్రయునుదుర్ఘటమైనటులుండు నింతయు
న్దలపరు హింసచేయమనితారచరింతురు కొందఱిమ్మహిన్

అను భారతవచనమునుఁ బట్టి అణురేణుతృణకాష్ఠస్థావర జంగమరూపంబులంబరగు చరాచరప్రపంచమంతయు జంతుమయంబుగానున్నది. అత్యంత సూక్ష్మజంతువు లెల్లెడలనిండియున్నవి. ఇదిసర్వసమ్మతమైనవాక్యము

అట్లైన నహింసావ్రతము సాధ్యమా?

ప్రపంచమంతయుఁ బ్రాణికోటిచే నిండియున్నదని విశదమగుచుండఁగా నెల్లవారును నెదోయొకవిధమున హింస చేయుచునేయున్నారు.

అట్లెల్లవారును జీవహింసచేయుచునే యుండునపుడు హింసచేయరాదని మాంసభక్షకులకుమాత్రమే చెప్పనేల? యనికొందరాక్షేపింతురు. అదివట్టి యాక్షేపణ. ఈక్రింది భారతవాక్యములచే నట్టియాక్షేపకుల యధిక్షేపము లకు సమాధానము విశదపడగలదు,

మ॥ హాలికుండెంతయునోజ దున్ను నెడస్నేరాగ్రంబునం బొంది పా
ణు నేకంబులుసచ్చుహింసయదియానోకాదొ వేయేలమర్త్యు
లు నేలంజరియించుచోఁబదములందొ్రిక్కంబడుం బెక్కుజం
తులుహింసావిధిగాదనంగవశమే దోషజ్ఞ యూహింపుమా

కం॥ పనివడి యహింసవ్రతముగఁ
గొని వనముననున్న మునులకుందొడరదె హిం
సనము తరుమూలశా
క నిపీడన మదియు హింసగాదొకొ తలపఁగ

ఎంతహెచ్చరికగలిగి చరించుచున్నను నెట్టివానికిని నేదోయొకవిధ మున జీవహింస సంభవించుచునే యుండును

## అపార్థఖండనము

ఇటుల నెల్లవారిచేతను నేదోయొకవిధముగఁ బ్రాణులునశించుటకు హేతువేర్పడుచున్నదను వాక్యమునుఁ బురస్కరించుకొని, మాంసాశనులు కొందఱీక్రిందవిధముగ వితండవాదము చేయుచున్నారు. భూమిపైనడచున పుడును, వంటచేయునపుడును, సేలదున్నునపుడును, మరి యన్నికార్యముల యందును నందఱిచేతను జీవరాసులు వధింపఁబడుచునేయున్నవి. అట్లె మాంసమునకై మేముఁగూడ జంతువులను చంపెదము. అందున దోషమేమని యడుగుదురు, అది మిక్కిలి దోషమేయగును' మాంసభోజనముచేయువారు మాత్రము ప్రయత్నపూర్వకముగా జంతువులను వధింతురేకాని తక్కినవా

రట్లువధింపరు. అని వార్యములై యగోచరములైసంభవించెడు జీవహత్యలకు నివారణోపాయమే కానరాదు. గాని మాంసభోజనుల విషయమట్లు కాదు. వారు మాంసాహారమును విడవాడినచో ప్రత్యక్షగోచరములగు ననేక హింసలు నిలిచిపోగలవు. 'I cannot get Amrutam, But why should I eat poison?' నాకు అమృతములభించదు. దానికై నేను విషము నెందుకుదినవలె. నను శ్రీవివేకానందుల వచనము ననుసరించి మనుష్యప్రయత్నమువలన నివారింపఁబడని హింసలు కలుగుచున్నవనుట సాధారణముగా గాని కడుపుకూటికై బుద్ధిపూర్వకముగా జీవహింస చేయరాదు. నీరుద్రావు నప్పుడెక్కడ జీవహింసాదోషము సంభవించునో యనుమానముతో;

దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలంపిబేత్।
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్॥

(మనుస్మృతి—అధ్యా 4 46)

(జంతుహింస సంభవించునుఁ గావున) త్రోవనడుచునపుడు మిక్కిలి జాగ్రత కలిగి యుండవలెను. నీరుద్రాగునపుడు శోధించి త్రాగవలెను సత్యమునే చెప్పవలెను, పరిశుద్ధమైన మనస్సుకలిగి యుండవలెనని మన్వాది ధర్మశాస్త్రకారులు విధించియున్నారు.

కం॥ హింససేయనివాడు లేడిజ్జగమున
నెక్కఁడైనను దమతమ యోపినట్లు.
హింస తెరువున కెడగల్గి యేగవలయు
నదియచూవె యహింసనా నతిశయిల్లు॥

(భారతము)

ప్రమాదవశంబున నెల్లవారును తలవనితలంపుతో నేమిగత్యంతరము లేక నేమి హింసనుఁ గారణభూతులేయగుచుందురు. ఐనను నెల్లవారును బుద్ధిపూర్వకముగా కడుపుకూటికైనిండు జీవములను హింసించిఁజంపక మిక్కిలి

మెలఁకువతో వర్తించుటయును సాధువులకును, బీదజంతువులకును బాధకలుగఁజేయునట్టి దుష్టప్రాణులనుహరించిన సజ్జనలోకమునకు సుఖముకలుగఁజేయుచుండుటయు నిజమయిన అహింసావ్రతమనబడుచున్నది.

## ధూమపానము

దేహారోగ్యమును పాడుచేసెడి దురభ్యాసములలోనెల్ల మిక్కిలి హానికరమైనదగు పొగపీల్చెడి దుర్వాడుక అబాలగోపాలమును దట్టముగానంటుకొనియున్నది. పదునాఱేండ్లకు లోబడినవారు పొగచుట్టల నుపయోగింపకూడదని కొన్నిరాష్ట్రములయందు శాసనము నియమము చేయఁబడియున్నను నీదుర్వాడుక నిలువలేదు. దినేదినే యభివృద్ధిఁజెందుచునేయున్నది.

కం॥ పొగచుట్లను బీడీలను
సిగరెట్లనుద్రాగబోకు చెడిపోవుదు నీ
సొగసైన రొమ్ముభాగము
నగుబాట్లగు చిన్ననాడె నమ్ముసుపుత్రా

అను నీతివాక్యమును బాలురకు బడియందు చిన్ననాటినుండియే మిక్కిలి దట్టముగను విపులముగను బహుశ్రద్ధగను బోధింపవలెను (పోషకులు) తల్లిదండ్రులీ విచారమున మిక్కిలి జాగరూకతగలవారై తమబాలురిట్టి దురభ్యాసముల పాల్పడకుండునటులఁ జూచుకొనవలెను. దీనిచే అొమ్మ్రంతుట, నాలుక రుచిచెడుట, నిస్సత్తువ, నిర్దయ- నిరుత్సాహము మొన్నగు బాధలు కలుగగలవు.

సిగరెట్ ప్రభావమేమని పొగడవచ్చును!

Ah Cigarett! Cigarette!! Cigarette!!!
My father Adam is tobacco, My mother
Eve, Go and see in Morraco. In the
Shool Boy's seleves' Ii the school boy's mouth
In the school boy's ears, in the school boy's

Fingers, in the school boy's books, I am
Fverywhere. Cigarette! Cigarette! Cigarette!!!

ఆహా! సిగరెట్ బీడీలు సర్వవ్యాపకములై యున్నవిగదా?

సిగరెట్-షోక్

కాలవైపరీత్యమేమోఁగాని ప్రతిబాలుఁడును, సిగరెట్-పీల్చుటొక కర్తవ్యమనియో, లేక యదొక షోకనియో భ్రమించి యాపిశాచపువాతబడి మిడకరించువాడుక నానాటఁ బ్రబలుచున్నది వర్తకజనుల యక్రమమునకు వికటకవుల ప్రకటనముతోడుపడి దేశమునకు హానికలుగజేయుచున్నదను * సుభాషితముచొప్పున నీదుర్వాడుక కాధారభూతముగా,

కం॥ విసువకఁ గొనదగునశ్యపు
పొడినైన పొగాకునైన పొగచుట్టయినన్
గుడిగుడియైనన్ కడ్డుల
పొడియైనను సరసకొకటి భూతలమందున్.

అను నిత్యాది కుకవికృత దుర్వాక్యములు దేశోపద్రవముఁ గావించుచున్నవి. ఈదుర్వాడుక మిక్కిలి యనర్థదాయకంబైనదనుట కీక్రింది విద్వద్వర్యులవాక్యమే విలువగల నిదర్శనముగనున్నది,

(ధూమపానపు అనాహుతములు)

బెంగుళూరు విక్టోరియా ఆస్పత్రిలో సబ్ అసిస్టెంట్ సర్జనులగు మ-రా-రా-శ్రీ బి-యస్- నాగభూషణముచే వ్రాయబడినది.

పొగాకు సాధారణముగా అమెరికా మున్నగు నుష్ణప్రదేశముల మిక్కుటముగ పండుచున్నది. దీనియందు మత్తుకలుగఁజేసెడి విషసంబంధయిన "నికోటిన్" అను పదార్థము హెచ్చుగానున్నది, అమెరికాదేశ

* సుజ్ఞానచంద్రోదయము 297-వ పుట

పొగాకు అన్నిటికంటె మేలైనదని వన్నెకెక్కినది, దీనిని బీడీ, సిగరెట్,
చుట్టా మొదలగు వానిరూపమునఁ బీల్చుటేగాక, హుక్కామూలముగను
పీల్చుదురు. పొగాకును తాంబూలముతో (వేర్చి) నములుటను మీరెల్లరు
జూచియేయున్నారు. దీనిని చూర్ణముచేసి ముక్కునకెక్కించి పిచ్చివారి
వలె తుమ్ముచుండు కశ్మలురను లోకమంతయు నెఱిఁగినదే. పొగాకునుప
యోగించుటచే కలిగెడు ననాహుతములు అనేకులకు దెలిసియున్నను వారి
దురభ్యాసమును విడువకుండుటంజూచి నాకు మిక్కిలి వ్యసనముకలుగు
చున్నది. నస్యమును మాటిమాటికి నాసికమునకెక్కించుటవలన ముక్కుయొ
క్క లోభాగపు సూక్ష్మనరములన్నియు చెడిపోయి ఘ్రాణేంద్రియము తన
కర్తవ్యమును చేయలేక బలహీనమగుటేగాక ఇతర అనాహుతములు వె
న్నంటియే వచ్చుచున్నవి. పొగాకును మిక్కుటముగ సేవించుటవలన మొ
దట వాంతియు, భేదియు, కలుగుటేగాక అతిదౌర్బల్యమును, తలదిరుగుట
యు. గలుగును. ఇంతేగాదు, హృదయకోశ శ్వాసకోశములు చెడిపోగలవు,
రక్తనాడులలో బిగితప్పిపోవుటేగాక నాడి బహుతీవ్రముగగొట్ట నారం
భించును. గుండె ధడధడమని గొట్టుకొనుటేగాక, ఎదలో నొప్పిపుట్టును.
నరములలో బిగితప్పిపోవును; క్రమేణ మెదడుచెడుట కారంభించును.
బుద్ధివైకల్యముకలుగును. చేతులు కాళ్ళు చిన్నతనమునందే వణుక నారంభిం
చును. వెఱపు, నిద్రాభంగము, ముంగోపము, హెచ్చుగును; నేత్రపటుత్వ
ముచెడును. నోరెండి గొంతుక నాలుకలుపొక్కి యజీర్ణమున కవకాశ
ము కలుగును. కంఠనాళములు పొక్కుటచే ధూమపాయీలకంఠధ్వని కఠి
నముగానుండును. బీడీచేఁదుటకుఁబోయి గడ్డమును మీసమును గాల్చు
కొన్నవారెందరో జనులు వెలుగుచుండు నిప్పుపుల్లలనుఁ బారవేయుటవలన
నవి యెన్నియిండ్లను కసవువామెలను గాల్చియుండలేదు? నడుచుచుండగా
నొకటి, కూర్చున్ననొకటి, నిలుచున్ననొకటి, మాటాడగానొకటి, ఈరీతి
గాపీల్చు ధీరులనుచూడరా? పెద్దమనుష్యులని బయటికి తోపఁజేసికొనువా
రనేకులు (ఇట్టివారు రాత్రివేళలందు బ్రాందిసీసాలనుదొర్లించి పగులగొట్టి

తెగఁద్రాగి భార్యలను గొట్టుచుండుటను నెడతెగకఁ జూచుచునేయున్నాము) నాకు క్షత్రియమార్కు (Mark) సిగరేట్ కావలెను, నాకు రాజామార్కుది కావలెను, నాకు రాణీమార్కుది కావలెననుచును, అమెరికా పొగాకులో నువాసనకలదు. దిండిగల్లుచుట్టలో ఆరోగ్యముకలదని చర్చించెడి నవనాగరకుల నెఱుఁగరా? *వీరినోటియందునువీరిజేబులందును బచ్చలి (జలధారి) కంపుగొట్టుచున్నను నిదేవారికింపు! నోటినుండి ఈశ్చి ముక్కునుండి పొడి విడుమచేష్టోక, వాచకులారా! పొగాకు అమెరికాదేశముదేకాని దిండిగల్లుదేకాని దానివిపసంబంధ దుర్గంధమునువిడుచునా? కొందఱికి పనిపూర్తి యయిఁనపిదప విశ్రమించునపుడు బీడీచేఁదవలెనట కొందఱికి పనిచేయఁబూనుటకు మొదట పొగపీల్చకున్నచో పనియె తోఁచదట, మరికొందఱికి చుట్ట (నొకసారియైనఁ) బీల్చకపోయినచో మలవిసర్జనమే కాదట, ఆహా ఏలాంటి యభ్యాసము? ఆబాలవృద్ధులెల్లరును నేర్చుకొనియుండు ఈదురభ్యాసమున కేమి చేతాము? యూరోపియనులలో స్త్రీలుగూడ ధూమపానమునకు దాసినులై తమ (కెమ్మోవి) సుందరమైన పెదవులను వివర్ణపఱచి శ్వాసకోశములను చెఱచుకొని తమ సహజమైన రూపలావణ్యములను పాడుచేసికొనుచున్నారు. ఇఁకమీద భారతమహిళలును తమ నాగరకతను ప్రకాశపఱచుటకై బీడీసిగరేటులను నోటఁగరచుకొని తిరుగనారంభింతురేమో! †

బీడీసిగరేట్టుపిశాచగ్రస్తులగు మనసోదరులెల్లరును తమదుర్వ్యాదుకల నడుగంటఁ బరిత్యజించినచో మిక్కిలి మేలుకలుగఁగలదు. అనేకమంది స్త్రీలకీ దుర్వ్యసనలుగిట్టవు. కావున తమభర్తలు నోటినుండి వెడలుచుండు ఈశకంపుతో తమముద్దియలను ముద్దుకొనఁబోగా వారాకంపును సహింప

---

* ఇట్టివారిని నవనాగరకులనుట సార్థకము ధర్మబోధకులనెల్ల నవనాగరకులనువారు మూర్ఖులు. దీనిసంపూర్ణవరము మాసంఘపు కలిమహిమయను గ్రంథములోఁగలదు.

† ఒక్కలిగపత్రిక (3—13—1913)

లేక ముఖమును ఓరబెట్టుకొనియో, ప్రక్కకు ఒదగియో మరియేమిష చేతనో దప్పించుకొని లోలోన కుళ్ళుచుండుటే గాక మోమాటమింతైన లేక నెదుటనే భక్తులకీ కారణము నెఱింగించిన వారిని నేనుఁబ్రత్యక్షముగఁ జూచియున్నాను. పరమేశ్వరుని కృపచే ఈ దురభ్యాసము శీఘ్రముగా నశించిపోవుఁగాక.

## జన్మాంతరవిచారము

జిహ్వాచాపల్యబద్ధులగు మాంసభుక్కు లతిచిత్రములైనవి. «అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభ» మ్మను న్యాయమునను సరించి, ఇప్పుడు తముచేవధింపఁబడు జంతువులు, గతజన్మమున తమ్మువధించియుండిన వనియు దానివలన నవియిప్పుడు తమచే మరణమొందుచున్నవనియు, ఇప్పుడు తాము వానిని వధింపనిచో దానికై మరల తామొక జన్మమెత్తవలసివచ్చునని యు సిగ్గులేకఁ బలుకువారు కొందఱుగలరు. ఆహా! ఏమి వీరిజన్మాంతరజ్ఞానము; ఛీ, ఛీ, వీరిబుద్ధికి ధిక్కారము! ధిక్కారము ఉత్తమమైనది మానవజన్మము. బుద్ధిలేనిది పశుజన్మము. అవ్యక్త జన్మంబునంబడి మిడకరించుచుండు క్షుద్రజంతువులయెడ లేశమైన కనికరములేక తమ నాలుకరుచికై యిట్లంత యు వాదించుట ధర్మమా? అదేమి గతజన్మమునం దవి తమనువధించిన వనుటకంటే ఈజన్మమునందే యవి వీరిచేవధింపఁబడి మరుసటి జన్మమునందు వీరిని తప్పక వధించుచున్నవనియేల చెప్పరాదు? మానవులను మానవులేవధించెడిగహాస్యమేమిటో! పశుజన్మాంతర మేకదా మానవజన్మము- మాంసభక్షకులారా! నిదానించి యోచింపుడు

## ఇంద్రియములతో ఆత్మకు సంబంధము లేదా?

మద్యమాంససేవకులును, దురాచారపరులునునగు భంగిపతివేదాంతులతో, ఏమయా! యెందుకీలాటి దురాచారమునంబడి మిడకరించెదరు. సన్మార్గమునం బ్రవర్తింపరాదా? యన్నచో అరే, ఛో, ఛో. వయ్యా ఆమా ఇంద్రియములాయా పనిచేయఁగలవు దానితో ఆత్మకు సంబంధమే మున్నదని బదులుచెప్పుదురు, ఇదిమిక్కిలి యవివేకము.

మనస్సులోనున్నదే ఇంద్రియములచేత చేయఁబడును. ఇంద్రియములచేత చేయఁబడునదే మనస్సువంటును ఒకటివిడిచి యొకటిలేదు. ఇంద్రియములు బాహ్యకరణములు. మనస్సు అంతఃకరణము యొక్క బాహ్యభాగము. అంతఃకరణముయొక్క విభాగమే బుద్ధి మనస్సువంటిదది బుద్ధివంటును. అది యాత్మకు సంబధించును ఈవిషయమునే పార్వతి పరమేశ్వరుని నడుగగా శివుఁడిట్లనియె.

కం॥ విచ్చలవిడి నింద్రియముల
నెచ్చటికైనను జనంగనిచ్చిన నరకం
బచ్చుపరుచు గుదియించిన
దెచ్చును గతి నరునకది సతీమణీ.

(భారతము-అనుశా)

అని ఇంద్రియముల దుష్కర్మలంగుఁ బ్రవేశింపకుండుటమంచిదే కాని ప్రవేశించినపిదప దోషముసంభవింపక మానదని సూచించెను.

సులభ, యనుయోగిని జనకునిఁబరీక్షింపవచ్చి రాజా! నాతో భోగింపుము! అయా ఇంద్రియము లాయాపని గావించును దానితో మనకేమిసంబంధము. ఇంతకు ఇదిస్త్రీ వీడుపురుషుడను భేదమే లేనప్పుడు ఎట్లుప్రవర్తించిన మనకేమి? యనియెన్నియో విధములఁబరీక్షించినను కొంచెమైన చలింపక జనకుఁడు, ఓసాధ్వీ, ఇదెట్టియవివేకము. స్త్రీపురుషభేదమే లేనప్పుడు నిశ్చింతగానుండవలెనుకాని, మరల నీవుస్త్రీయని నేనుపురుషుఁడని తలంచుటేల? మరి సంభోగించుటేల? అట్టిచంచలబుద్ధి నాకులేదు. కావున నీతో గ్రీడింపవలెనను కోరికయును లేదు. వచ్చినదారిఁబట్టి వెళ్ళుము. నీయుపదేశ మింతేచాలునని మారుపలికిన జనకునిదృఢబుద్ధిని మెచ్చుకొని సులభతన నిజరూపముతో నాతనియెదుటనిలిచి యిట్లనియె.

వాచావిరక్తాః క్రియయానురక్తాః
దారేషుపుత్రేషు ధనేషుసక్తాః
విత్తార్జనేవిశ్రుభాషవేషాః
వేదాంతవాక్యాని వదంతిమూఢాః.

రాజా! లోకములో శుష్కవేదాంతులు కొందరు నేనే బ్రహ్మమని వాచామాత్రమున పలుకుచు క్రియాశూన్యులై, ఇతరులకు వేదాంతమును, విరక్తిభావమును బోధింపుచు తాము జీవనశ్రీయబద్ధులై తొక్కులాడుచు, ధనార్జనారతులై వివిధవేషములు వైచి కపటతంత్రములంబన్నుచుందురు. అట్టివారు మిక్కిలిమూఢులు.

జనక మహీపాలా! నీవు మిక్కిలి నిర్మలుఁడవు నీదర్శనములభించుటచే నేనుధన్యురాలనైతిని. నిన్నుబరీక్షించుటకయిచే వచ్చియుంటినని చెప్పివెడలిపోయెనఁట. కావున నింద్రియములు చేయు క్రియలతో మాకుసంబంధములేదనువారు మిక్కిలి యవివేకులు. ఇంద్రియములను స్వేచ్ఛగావిడిచిపెట్టక, వానిని తమస్వాధీనమందుంచుకొని యుండువారే ధన్యులు.

విరామము

ఓ, పరమేశ్వరా! పరమకల్యాణగుణాభరణా, పాపవిధ్వంసనా, ప్రణతార్తిహరణా, పరమకారుణ్యమూర్తీ, పరమార్థపంధాయకా!

ఆ॥ దంతియడుగులోనఁ దక్కినజంతుచ
యంబులడుగులెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటులన్నియు లోనగు
నిద్ధగుణ యహింస కింతనిజము.

(భారతము)

అను మహావాక్యమునకు బద్ధపడి మిత్రులకోర్కెననుసరించి, నీదయచే ఈగ్రంధమునొకతీరుగా వ్రాసి ముగించడమయినది. దీని నిర్మాణములో మహనీయుల వ్రాతలనేకములు నాకుఁదోడైనవి. దేశబాంధవులగు వారందరును నాకు వంద్యులు నీదివ్యకటాక్షమునకుఁ బాత్రులు అట్టి సేవకవర్గములో నన్నొకనిగాఁ జేర్చుకొని నాచేతఁగావలసిన సేవలనుఁజేయించుకొనుము. అఖిల హృదయారవిందచేతోమిళిందా! పరమపావనచరిత్రా! నీకృపచే జనాంగమున భూతదయ నెలకొనుఁగాక. భద్రమూర్తీ! దీనజంతువులకభయమొసఁగి రక్షించుభారము నీయందేయున్నది. భక్తజనులు విశ్వకుటుంబసేవయందు నిరతులయ్యేయున్నారు. నీవుతోడ్పడి కార్యసాఫల్యమొనఁగావింపవలసినదొక్కటియే ముఖ్యము. అది నీయనుగ్రహము.

# "పశువధ"

మనరాజధానిలో ఆహారమునకు తోళ్లకు వ్యవసాయా
భివృద్ధి కుపకరించు పశువులెన్ని గత 5 సంవత్సరములలోపల
వధింపఁబడినది దెలుప వలసినదిగా అంకినీడు ప్రసాద బహద్దరు
గారు మొన్న శాసనసభలో ప్రశ్నించినప్పుడు అభివృద్ధిశాఖామం
త్రిగారు మ్యునిసిపల్ సరిహద్దులలో కోడెలు 78, 131, ఆవు
లు 1,43, 313 దూడలు, 11,429 స్థానికసంఘములలోనివా
లలో ఆవులు 90,637 దూడలు 13,509 మొత్తముకోడెలు
78,131 ఆవులు 2,33,950 దూడలు 24, 938 అనియు యివి
షుమారు సంఖ్యలని తలంపఁబడవలెనని ప్రత్యుత్తరమిచ్చిరి. దీని
నిబట్టిచూచిన సంవత్సరమొకటికి కోడెలు 15,626 ఆవులు 46,
760 దూడలు 4,987 వధింపఁబడినట్టుల స్పష్టపడఁగలదు. దేశ
సౌభాగ్యమునకు, ఐశ్వర్యమునకు కారణభూతమైన పశువులు
లక్షలకు లక్షలు, ఆహారమునకు, తోళ్లకు వధింపఁబడుచుండుట
ఎంతపాపకార్యమో, యించుక యోచించిన తెలియఁగలదు
ఇందుకే వ్యవసాయము అభివృద్ధిఁ జెందక క్షీణించుచున్నది
ప్రజలు క్షీరములు లేక పాశ్చాత్య పాలడబ్బీలకై యాసించవ
లసిన గతిపట్టుచున్నది. భూసారమునకై ఎరువులు నిమిత్తము
ప్యారీ కంపెని కటాక్షమునకు గురికావలసి వచ్చుచున్నది. దీని
కంతకు ఒకవిధమున పాలకులను మఱియొకవిధమున ప్రజలు
ను జవాబుదారులనక తప్పదు ఈవధను నిరోధించు మార్గ
మును దేశీయులు యోచించనిచో ఆర్థికసమస్య పరిష్కరించఁగల
వ్యవసాయము సన్నగిల క్షామము ప్రబలి దేశీయులు తిరిపమెత్త
వలసిన దుర్గతి తప్పక సంభవించకపోదు. శాసనసభ్యులు యింక
కండ్లు తెఱచి పాలకుల నొకవైపు హెచ్చరించియు, చనిపోయిన
జంతువులుతప్ప మిగతా జంతువులేవియు ఏ ఉద్దేశ్యమునను :

ధింపకూడదను శాసనమొకటి చేయించవలెను లేనిచో ముందు దేశము నెదుర్కొనుచున్న ఆర్థికసమస్య మహాఘోరరూపమున ముంచకపోదు -

" ఫిబ్రవరి 27,1924 తేదీగల దీనబంధు నుండి,, పై నవివరించిన పశుగణము గాక లెక్కతేల్చుటకు వీలులేనిగాని మాదులందు వధింపబడు పశుసంఖ్యను లెక్కించినఎట్టి పాషండహృదయునికైనను గనికరము కలుగక మానదు ఆర్యావర్త దేశమునందుద్భవించిన ఆర్యులమనివిఱ్ఱవీగు మననాయకులు నేటివరకిందుకొఱకై ఎంతకాలమునువ్యయపఱచిఏమిపనిని చేయఁగలిగిరో ఏటేట ఎంతసంఖ్యనుతగ్గించుచుండిరో విచారింపుడు, మనకు, నూటికి 70 మందికిముఖ్యాధారము వ్యవసాయము, పశుగణములేనిదేవ్యవసాయముసాగదు, అట్టి సజీవపశువును వధించుట ఆత్మహత్యచేసికొనుటవంటిది.

మామిత్రులగు మ. రా. శ్రీ. యర్రింశెట్టిసూర్య సత్యనారాయణగారిజనని స్వర్గస్థులైరి. వారిపూర్వాచారమునను సరించి యంత్యకర్మలు జరిపిన మరుదినము బంధువర్గసంయుతముగ మాంసభక్షణ మొనరించుట విధియైయున్నను. సర్వజీవదయాసుహృద్భావులగుట పాపహేతువగునట్టి తుచ్ఛాచారమునునిషేధించి సర్వబంధు జనసమక్షమున దానినామోదింపఁజేసి మోదంబున షడ్రసోపేతముగా విందారగించి మాప్రాంతమునందలి కాఁపు (తెలగ) కులజులకు మార్గదర్శకులైరి, ఇట్టి యహింసావ్రతాచరణ ధురీణులకు భగవంతుఁడిష్టార్థముల నొసంగుఁగాత —

ఇట్లు

అద్దేపల్లి సత్యనారాయణ.

## స్వస్తి

కం॥ స్వస్తి జగంబున వెలయుత!
నిస్తులసుఖ సంపదాళి; నెలకొన నెంతే
బ్రిసుత కార్యంబుల సుజ
నస్తోమమొనర్చుగాత నమితలిమీఱన్.



## శ్రీ వేణుగోపాల దండకము.

శ్రీ వేణుగోపాల బాలా మహాభక్తలోలా, సదా దీనపా
కృపంజూడవేలా, జగంబందు నీపాటిగా గోగణంబంతయున
శనంబొందుచుండంగ నీవూరకున్నావి దేలా, యుపేక్షించ
లా, దయంజూడవేలా, సదానంగ నీవప్డుడద్వాపరంబం
నత్యంతసంతోషి తస్వాంతతన్ , గోపబృందంబులెల్లన్ని
గొల్లగాగోసమూహంబులన్ మేపలేదా, మఱిన్ గోపు

బట్టి చెండాడుచున్నట్టి యాధేనుకాఖ్యాది, ఘోరాసురాళిఁ వడిఁ బట్టి శిక్షింపలేదా, మహాగర్వివై స్వోన్నతిఁ ఘోరహాలాహలంబుఁ, బకుల్ దాఁవునా నీటిలోఁగల్పి యత్యుగ్రుఁడై జంతునాశంబుగావించుచున్నట్టి కాళింగునింబట్టి ఘోరంబుగాఁ గొట్టి తద్గర్వముఁ మట్టుబెట్టంగలేదా; మఱిన్నిందఁ యాగాంతరాయంబుచేనైన క్రోధంబుచే దేవతానేత దారాళ్ళవానంబడం జేయగాఁ గోపబాలుల్ మఱింగోవులెల్లఁ భయగ్రస్తులై కంపమొత్తఁ వెస్, కృష్ణకృష్ణా!! యమ్మఁ బ్రోవుమంచార్తనాదంబుఁ జేయనాలోపలఁ వేగగోవర్ధనోద్ధారివై యార్తులఁ బ్రోవలేదా, మఱిఁ ఘోరదావాగ్ని భీతాత్ములైనట్టి యాగోపగోసంఘముఁ పూర్ణ కారుణ్య రాజత్కటాక్షంబుతోఁ బ్రోవలేదా, కృపాళూ! భవద్దివ్య కారుణ్య సద్దృష్టి చేదీనగోజాతి కష్టంబులఁ నిత్యమాసన్నమౌచుండు నన్యాయమౌ ప్రాణనష్టంబులఁ బాపివేవేగరక్షించు మోదివ్యకారుణ్యభావా !! మహాభక్తితోఁ నీదుపాదారవిందంబులఁ నిత్యముఁ గొల్చుచున్నట్టి సద్ధర్మ సంస్కర్తలపిఁంచునే తాదృశంబైన విజ్ఞాననాళ్ళింగటాక్షించి సాఫల్యతఁ గూర్చుమో దేవదేవా, మహాసత్ప్రభావా! నమస్తే !! నమస్తే !! నమస్తేనమః!!!

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

తత్సత్. శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా

శ్రీగోపాల కృష్ణార్పణమస్తు.



# ఆంధ్రప్రబోధినీగ్రంథనిలయము.

## మండపల్లి,

లింగాలపోస్టు.—కృష్ణాజిల్లా,

సంపాదకుఁడు.
ఇక్కుర్తి తిరుపతిరాయఁడు.
(బాలకవి)

ప్రకాశకుఁడు.
అద్దేపల్లి సత్యనారాయ

నవరసభరితములగు నవలలు—నవ్యభావార్థసంకలి
ములగు నాటకములు—సుజ్ఞానప్రబోధంబులగు ప్రబంధ
లు.—సుజనభాయిష్టములగు మహాపురుషుల జీవితములు—
ఆనందమయములగు చరిత్రములు—పుణ్యపురాణములు—
గ్లేజు కాగితములతో, మొల్లమొగ్గలవంటి యక్షరములతో
ముచ్చటైన బొమ్మలతో, ముద్దులొలుకు బైండులతో, మ
డుమాసములకొక్కటివంతున మత, సాంఘిక, నైతిక, ఆ
చారిత్రిక, వ్యవసాయక, రాచకీయాది సమస్తవిషయము
జర్చించు గ్రంథములు వెలువడుచుండును. ప్రతి గ్రాహ
శాశ్వత చందాదారుల పద్ధతిని విక్రయింపఁ బడుచుం
మాగ్రంథమండలి యభివృద్ధియంతయు మాతృదేశ, భా
మానులగు మాసోదరుల యాదరాభిమానములపై నాధ
డియున్నది.        మా చేయు దేశసేవకు,